# విషయసూచిక.

---

# ఈ గ్రంథమునందలి చిత్రముల పట్టి.

పుట

# 1. హంపి-విజయనగరము.

మదరాసు రాజధానికి చేరిన బళ్లారి జిల్లాలో హంపి యను చిన్న గ్రామ మొకటి యున్నది. ఇది తుంగభద్రాతీరమునందుండుటచేత గొప్ప తీర్థముగాను, ఇందు శ్రీ విరూపాక్షుని ఆలయముండుటచేత గొప్ప క్షేత్రముగాను ప్రసిద్ధిజెందినది. ఈ గ్రామమును చేరుటకు M.S.M. రైలుమార్గమున హొసపేట స్టేషనునందు దిగి అందుండి బండ్లపైగాని, బస్సులపైగాని వెళ్లవచ్చును. స్టేషనునందుండి ఈ గ్రామము దాదాపు 9 మైళ్లే దూరమున నున్నది. విజయనగరమందలి యవశేషములను చూచుటకు బోవు యాత్రికులు బసచేయుటకు వసతియైన ముసాఫీరు బంగళా కమలాపురమునందున్నది. ఇచటినుండి హంపి గ్రామము 3 మైళ్లు. ఈ మధ్యప్రదేశముననే రాజనగరులు, రాణీనివాసము, గజశాలలు, మంటపములు, దేవాలయములు మొదలగు విజయనగరపు ముఖ్యమైన పరిశిష్టములు సుమారు 10, 12 చదురపు మైళ్ల ప్రదేశమున వ్యాపించియున్నవి. కంపిలి, కమలాపురము, ఆనెగొంది, హొసపేట ఇవన్నియు చేరిన ప్రదేశమే విజయనగరము. ఏ దిక్కున చూచినను కంటిచూపు మేరవఱకు గుట్టల వరుసలు తప్ప వేరెద్దియు కనబడదు. అందందు 200 అడుగులకు పై నెత్తుగల బ్రహ్మాండమైన చట్రాతి బండలొకటిపై నొకటి అతిసూక్ష్మముగ నమరియుండు వింతదృశ్యములు మనస్సున కాశ్చర్యము కలుగజేయును. ఉత్తరమున తుంగభద్రయే మేరగాగలిగి దక్షిణమున హొసపేటయందు తప్ప తక్కిన యన్ని దిశలయందును దాటుట కసాధ్యమైన గుట్టలచేత నావరింపబడిన ఈ ప్రదేశము క్రీస్తు పదునాల్గవ శతాబ్దారంభమున విజయనగర రాజధానియై తదనంతరము ఆ రాజులచేత పెక్కు ఆలయముల తోను, రాజనగరులతోను నింపబడి జనసమృద్ధియైన గొప్ప పట్టణముగ మారి క్రీస్తు పదునారవ శతాబ్ద మధ్యమమువఱకును ప్రఖ్యాతిగ వెలయుచుండెను.

## 2. హంపియందలి ప్రాచీన ధార్మిక అవశేషములు.

రామాయణకాలమునుండి పంప ప్రసిద్ధివహించిన స్థలము. ఆ కాలపు, అనగా 'త్రేతాయుగపు' చిహ్నములు ఇప్పటికిని యిందు కొన్ని యున్నట్లు ప్రతీతియున్నది. శ్రీరాములు కపిరాజైన సుగ్రీవునిన్ని, అంజనాపుత్రుడైన హనుమంతునిన్ని గాంచినది ఇందే. సుగ్రీవుడు శ్రీరాములచేత వాలిని చంపించినది ఇచ్చటనే. రామబాణము చేత దహింపబడిన వాలియొక్క శరీరము భస్మరాశియై పడినట్లును ఆ రాశియే ఇప్పుడు 'వాలి దిబ్బ' యను నచ్చట గాన్పించు బూది దిబ్బయనియును నచ్చటివారు చెప్పెదరు. ఋష్యమూకము, మాల్యవంతము, మాతంగము, అంజనాపర్వతము, వాలిభాండారము, శబరి గుహ, పంపాసరోవరము ఇత్యాదులు యిందలి ముఖ్యమైన పౌరాణిక స్థలములు. పంపాక్షేత్రమునకు బోవు ప్రతి యాత్రికుడును వీనిని చూడక మరలడు. కిష్కింధ సుగ్రీవుని రాజధానిగనుండెను. అది కొండలమధ్యనుండు యిప్పటి యానెగొంది కావచ్చును. అచటి నుండియే శ్రీరాముడు వానరసైన్యముతో దక్షిణమునకు వెడలి సముద్రమునకు సేతువుకట్టించి సాగరమును తరించి, లంకను ముట్టడించి, దశకంఠుడైన రావణుని సంహరించి రాక్షసులను నిర్మూలముచేసి సీతాదేవిని తెచ్చెనని రామాయణము నుడువుచున్నది. ఇట్టి పావనమైన స్థలముయొక్క చరిత్రను తెలుసుకొనుట ప్రతి భారతీయునికి కర్తవ్యము.

పంప ఐతిహాసికయుగమునందు గొప్ప క్షేత్రముగా వెలయుట మాత్రమేగాక అఖండభూమండలమందును కీర్తిశేషులుగానుండు విజయనగరాధీశులకు 2, 3 శతాబ్దముల కాలము అవిచ్ఛిన్నముగ రాజధానియై ప్రఖ్యాతిగాంచెను. మ్లేచ్ఛుల భయముచేత నిస్తేజముగానుండిన భారతీయుల వైదిక సంస్కృతి మరల తలయెత్తి ప్రకాశింపదొడగినది ఈ హంపియందే. ఉత్తర హిందూస్థానమంతయూ మ్లేచ్ఛులమయమై దక్షిణమునకును వీరి సంస్కృతి వ్యాపించు తరుణమున యాదవవంశజులని పేరొందిన హక్క (హరిహర), బుక్క

లను రాజులిద్దరు సనాతనధర్మమును నిలిపిరి. భారతీయులకు నిర్వ్యాకులసామ్రాజ్యభోగ మనుభవింప సమయమేర్పడినది. ఏ స్థానము దక్షిణపు ప్రాంతమునందుండు లంకాధిపతియైన రావణుని వంశనిర్మూలనమునకు కారణమైనదో ఆ హంపి-యానెగొంది ప్రభావమే ఉత్తరమునందుండివచ్చుచున్న మ్లేచ్ఛులదాడిని అడ్డగించి దేశమునందు శాంతిని సమకూర్ప కారణమైనది. రాజ్యమున సుఖసంపత్తులు ప్రబలినవి.

పై జెప్పినట్లు శ్రీరాముని కాలమున నిందు కపిరాజ్యము స్థాపితమై యుండెనని రామాయణమువలన తెలియుచున్నది. ఆ కాలమున నీప్రాంతమున వానరధర్మసంస్కృతియే ప్రబలియుండెనని తోచుచున్నది. తదనంతరము అశోకుని కాలమువఱకు నీ ప్రదేశమున నే ధర్మము ప్రచురమందుండెడిదని తెలియజేయు ప్రమాణము లేవియు లేవు. పంపకు సమీపముననుండు కొప్పళ గ్రామమందు అశోకుని ధర్మశాసనములుండుటనుబట్టి ఈ ప్రదేశమందు బౌద్ధ ధర్మము ప్రచారముననుండియుండవచ్చునని తోచుచున్నది. వైదిక ధర్మమునకే జన్మస్థానముగ వెలయుచున్న పంపాక్షేత్రము ఆ కాలమునగూడ ప్రసిద్ధముగనుండినందువలన దాని చాటుననే తమ మత ప్రచారమునకై యొక కేంద్రమును బౌద్ధమతస్థులు స్థాపించిరను నూహ పొడముచున్నది. బౌద్ధమతమస్తమించిన తరువాత జైనధర్మ ప్రచారము ప్రబలి వ్యాపించెననుటకు కొప్పళునందలి యనేక జైన తీర్థంకరుల సమాధులు, 8, 9 వ శతాబ్దముల శిలాశాసనములు సాక్ష్యములుగనున్నవి. హంపి-విజయనగర పరిసర ప్రాంతములందును ప్రబలమైన జైనావాసముండెననుటకు క్రీస్తు 1368 వ సంవత్సరమునందు బుక్కరాయలు పట్టణమున జైన, శ్రీవైష్ణవులకు కలిగిన కలహమునుతీర్చి, పరిసర ప్రాంతములందుండి ఆయా మతముల ప్రముఖులను రప్పించి వారిచే సమ్మతి పత్రములను వ్రాయించినట్లు లిఖించిన శిలాశాసనమే ప్రమాణము. హంపి సుప్రసిద్ధమైన శైవక్షేత్రమని యిదివఱకే చెప్పియున్నాముకదా. ఈ గ్రామమందును దీని చుట్టు

పట్లు ప్రదేశములందును నాగ, నాగకన్యకల శిలలు అమితముగా కాన వచ్చుచున్నవి. నాగప్రతిష్ఠ ఆ కాలమునందే హిందువులలో విశేషముగ నాచారమందున్నట్లు తోచుచున్నది. ఇప్పటికిని ఈ వాడుక యున్నది. బౌద్ధులుకూడ ఈ సంప్రదాయము నవలంబించిరి. తత్ప్రమాణముగ క్రీస్తు 3 వ శతాబ్దమున రాజ్యము నేయుచుండిన ఆంధ్రచక్రవర్తియగు హారితీపుత్రవిష్ణుకడ్డ చుటుకులానందసాతకర్ణి యొక్క కూతురు సాతసివనాగసిరి తన కుమారునితో గూడ నొక నాగమును, తటాకమును నొక విహారమును దాన మొసగినట్లు వ్రాయించిన శాసనము బనవాసియందున్నది. ఈ శాసనమందు చెక్కబడిన నాగశిల బనవాసిలోని మధుకేశ్వరాలయమం దిప్పటికిని యున్నది. ఈ శాసనముకూడ పై నాగశిలయంచుపై చెక్కబడియున్నది. బౌద్ధ హిందూ సంస్కృతులసంయోగము ఆ కాలమందు దక్షిణభారతమున ప్రబలముగానుండెనని తోచుచున్నది. ఇట్లీప్రదేశమందు బౌద్ధ, జైన, హిందూ ధర్మములాచారమునందుండినను, బౌద్ధధర్మముయొక్క చిహ్నములేవియు హంపియం దిప్పుడు కనబడకున్నవి. జైన దేవాలయములు ఇందుండినవని ఇచటి కొన్ని కట్టడముల రీతినిబట్టి చెప్పవచ్చును. విరూపాక్షాలయమునకు దక్షిణమున హేమకూటముపైని దేవాలయములలో కొన్ని జైన బసదులని కొందరు పండితుల యభిప్రాయము. ఈ కట్టడముల రీతి జైన పద్ధతి ననుసరించియుండుటే దీనికి కారణము. కాని ఈ యాలయముల గోడలపైనను, వాకిండ్లపైనను చెక్కబడిన విగ్రహములను, శిఖరములపై దీర్చిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, నరసింహ, గణపతి ఇత్యాది మూర్తులను జూచిన నీ యాలయములు శైవ, వైష్ణవ మతములయం దొక్కదానికి సంబంధించినట్లు తోచుచున్నది.

హంపియందుండు అవశేషములలో పై జెప్పిన యొకటి, రెండు తప్ప తక్కినవన్నియు హిందూమతముకు సంబంధించినవే. ఇప్పటి పంపాపతి ఆలయము ఏకకాలమున నిర్మింపబడినట్లు తోచదు.

దేవాలయమందలి యన్ని భాగములున్ను ఒకేరీతిని యుండకపోవుటయే ఈ యూహకు కారణము. ఆలయములోని భువనేశ్వరీగుడియందు చాళుక్యయుగపు శిల్పము లగపడుటచేత నిదియే యిప్పుడుండు దేవాలయములన్నిటికంటె మిక్కిలి ప్రాచీనమైనదని చెప్పవచ్చును. విరూపాక్షాలయమందలి శాసనములలో నాగవంశపు రాజైన కలిదేవరసుని శాసనమున (శక. 1121) పంపయందు నాలుగైదు దేవాలయములున్నట్లు వ్రాయబడియున్నది. అవి యెవ్వియన పంపాలయము, విరూపాక్షగృహము, బ్రహ్మేశాలయము, భైరవాలయము, ఇర్మడి రాచమల్లేశ్వరాలయము. ఇప్పటి భువనేశ్వరి యాలయమే కలిదేవరసు శాసనమున బేర్కొనబడిన విరూపాక్షాలయాంతర్గత పంపాలయము గావచ్చును. తక్కిన కట్టడములను గుర్తించుటకు వీలుకాదు. ఏలన, నవి శిథిలములుకాగా నాచోటనే నవీనముగా కట్టబడిన దేవాలయములు మనకిప్పుడు కానవచ్చుచున్నవి. మరియు హొసదుర్గ, కుంమతములకు దొరయైన కంపిలరాయడు తన పితృపితామహప్రపితామహుల జ్ఞాపకార్థముగ హేమకూటముపై లింగస్థాపనముచేసి యొక చిన్న దేవాలయమును కట్టించెనని అందలి యాలయములలో నొకదాని స్తంభముపై శాసనము చెక్కబడియున్నది.* ఇవియే విజయనగర నిర్మాణపూర్వము హంపియందుండిన దేవస్థానములు.

---

* ఈ స్తంభము ఈ గుడికి సంబంధించినదని తోచదు. దీనిని ఈ యాలయమందలి మూలమునకు ప్రాపుగ గుడినిర్మాణమైన తరువాత నెప్పుడో పెట్టినట్లు కాన్పించుచున్నది. అయినను, యీ గుడి జైనాలయము కాదని ముందే చెప్పియున్నాము.

## 3. హంపియొక్క ప్రాచీనత.

హంపి పరిసర ప్రదేశములందు ఐతిహాసికయుగమునకు పూర్వపు చిహ్నములు అందందు కానవచ్చుచున్నవి. ఆదియుగపు రాతి ఆయుధములు, వివిధములగు కుండలు, సమాధులు (dolmens), బూడిద దిబ్బలు మొదలగునవి యనేకములున్నవి. వీనిని బట్టి చూడగా నీ ప్రదేశము ప్రాచీనకాలముననుండి జనావాసమున కనుకూలమైయుండెననుట స్పష్టము.

ఐతిహాసికయుగమునకు జెందునట్టి మిక్కిలి పురాతనమైన పరిశిష్టములు సయితము ఈ ప్రదేశమునందు కాన్పించుచున్నవి. క్రీ.పూ. మూడవ శతాబ్దమునాటి మౌర్యవంశపు చక్రవర్తియైన యశోకుని ధర్మశాసనములు మైసూరు రాష్ట్రమందలి చిత్రదుర్గ జిల్లాలోని సిద్దాపురమను గ్రామమునకు సమీపముననను, నైజాము రాష్ట్రమందలి కొప్పళ్ గ్రామమందును, గుత్తి సమీపమున యఱ్ఱగుడియందును దొరికియున్నవి. వీటి కాలమునకు తరువాత నాలుగైదు శతాబ్దములవరకు, అనగా, క్రీ.శ. 2, 3 వ శతాబ్దములవఱకు నీ ప్రదేశముయొక్క చారిత్రక విషయములను తెలియజేయు నాధారము లేవియు నిదివఱకు వెలువడలేదు. క్రీ.శ. 2, 3 వ శతాబ్దములు మొదలుకొని 7 వ శతాబ్దారంభమువఱకు నీ ప్రదేశము ఆంధ్ర, పల్లవ, బాణ, కదంబవంశపు రాజుల ఆధిపత్యమునకు లోబడి యుండెనని ర్ణయించుటకు పెక్కు ప్రమాణములున్నవి. క్రీస్తు 2, 3 శతాబ్దములనాటి యాంధ్ర చక్రవర్తులు తూర్పు సముద్ర తీరమునందు కృష్ణానది యొడ్డుననుండు ధరణికోటను అమరావతిని రాజధానిగ జేసుకొని తమ ప్రభుత్వమును నలుదిక్కుల పెంచుచు వచ్చిరి. వీరు బౌద్ధ ధర్మమును పోషించిన రాజులు. వీరే శాతవాహనులు. వీరి ఆధిపత్యమునకు బళ్లారి జిల్లాకూడ లోబడియుండెను. ఆదవాని తాలూకాలోని మేకదొన గ్రామమునందు శాతవాహనరాజైన

సిరిపులుమావి యొక్క శాసన మొకటియున్నది. మహాసేనాపతి ఖంద నాకని (స్కందనాగని) వశమున నుండిన 'సాతాహనిహార' జనపద మునకు చేరిన వేపురక గ్రామమునందు గృహపతి యొకడు. తటాక మును త్రవ్వించినట్లు ఈ శాసనమున లిఖించియున్నది. ఇదే జిల్లాలోని హిరేహడగల్లి గ్రామమందు దొరికిన పల్లవ శివస్కందవర్మ యొక్క తామ్రశాసనమును బట్టి యీ ప్రదేశమునకు 'సాతాహనిరట్ట' యని పేరుండినట్లు తెలియుచున్నది. గనుక 'సాతాహనిహార' అథవా 'సాతాహనిరట్ట' (శాతవాహన రాష్ట్రము) యందు బళ్లారియొక్క బహుభాగము ఇమిడియుండెనని చెప్పవచ్చును. ఆంధ్ర శాతవాహనులకు పిమ్మట నీదేశము కాంచీపురము రాజధానిగ పాలించుచున్న పల్లవరాజుల యాధిపత్యమునను౦డెనని తెలియుచున్నది. పల్లవుల సామంతులైన బృహద్బాణులు రాయల సీమయందు (Ceded districts) రాజ్యము సేయుచుండ, కదంబుల మూలపురుషుడైన మయూర శర్మ వీరిని యోడించి స్వతంత్ర రాజ్యమును స్థాపించెనని తళగుంద శాసనమునుబట్టి తెలియుచున్నది. పల్లవుల ఆధిపత్యమున నుండిన కర్ణాటక దేశము కదంబులకు లోబడినది. అదిమొదలు విజయనగర రాజ్య స్థాపనమువఱకు నీ దేశము కర్ణాటక ప్రభుత్వమునకే లోబడియుండి విజయనగరరాజుల యాధిపత్యమునందు ఇందలి హంపి గ్రామమే రాజధానిగ నిర్మింపబడినది.

చిరకాలమునుండి హంపి పేరొందిన తీర్థమనుటకు పౌరాణిక ప్రమాణములేకాక ప్రాచీనైతిహ్య ప్రమాణములుకూడ పెక్కులున్నవి. పంపను బేర్కొను శాసనములలో మొదటిది క్రీస్తు 7 వ శతాబ్దము నాటి బాదామి చాళుక్యరాజైన వినయాదిత్యుని తామ్రశాసనము. దీనియందు, రాజు పంపాక్షేత్రమున విడిసియుండగా, విద్వాంసులకు కొందరికి భూదాన మొసగినట్లు వ్రాసియున్నది. ఇదే వంశపు రాజైన ఐదవ విక్రమాదిత్యుని కాలపు శాసనమొకటి శక 935 వ (క్రీ.శ. 1013) సంవత్సరమున పంపాపతియైన మహాకాలునికి వృద్ధమబ్బరసియను పల్లవ వంశపురాణి భూదానము చేసినట్లు వ్రాసి యున్నది. హంపీ విరూపాక్షుడు ఆ కాలమున మహాకాలుడని

ప్రసిద్ధిగాంచినట్లు తోచుచున్నది. శక 975 వ (క్రీ.శ. 1053) సంవత్సరమున చాళుక్యరాజైన ప్రథమసోమేశ్వరుని ప్రభుత్వము నందు అక్కాదేవి పంపాతీర్థమున భూదానమొనర్చినట్లు లిఖించి యుండు శిలాశాసన మొకటి యున్నది. విరూపాక్షాలయమందలి శాసనములలో నొకదానియందు క్రీ.శ. 1199 వ సంవత్సరమున నాగ వంశపు రాజైన కలిదేవుని ప్రభుత్వమునందు విరూపాక్షునికిని పంపా దేవికిని భూదాన మొసగబడినట్లున్నది. ఇందువలన పంపాక్షేత్రాధి పతియగు దేవునికి నీకాలమున విరూపాక్షుడనియు, దేవికి పంపా యనియు నామములుండినట్లు తెలియుచున్నది. క్రీ.శ. 1235 వ సంవత్సరమునందు హొయిసళ సోమేశ్వరుడు పంపాపతిని దర్శించి దేవునికి దానముచేసినట్లు వ్రాయించిన శాసనమొకటియున్నది. హంపికి భాస్కరక్షేత్రమని పేరుండునట్లు క్రీ.శ. 1494 వ సంవత్సరపు శాసనమొకదానియందు వ్రాయబడియున్నది. ఇట్లు హంపి గొప్పక్షేత్రమని యెన్నబడి క్రీస్తు 7 వ శతాబ్దము మొదలు ప్రసిద్ధిగ నుండెను. తరుచుగానందు రాజు విడిసియుండుటనుబట్టి యంతదాక చిన్న గ్రామమైనను యుండెననుట నిశ్చయము. ఆ హంపి గ్రామమునే విద్యారణ్యుల ఆజ్ఞమేరకు హరిహరుడు తన రాజధానిగ జేసుకొని విజయనగరమును స్థాపించెను.

# 4. విజయనగర రాజుల సంక్షిప్త చరిత్ర.

విజయనగరమందలి శిథిలములను తెలుసుకొనుటకు ముందు విజయనగర రాజ్యస్థాపనము మరియు నా రాజుల వంశ చరిత్ర తెలిసికొనుట అవశ్యము. ఏలన అచ్చటి పరిశిష్టములన్నియు నా రాజులు నిర్మించిన కట్టడములకు సంబంధించినవే. చాళుక్యరాజ్యావసానమైనంతట ఆ సామ్రాజ్యముయొక్క ఉత్తరభాగమును దేవగిరి యాదవులును, దక్షిణప్రాంతమును ద్వారసముద్రపు హొయిస్సళులును, తూర్పుభాగమును ఓరుగంటి కాకతీయులును నాక్రమించిరి. ఇట్లు చాళుక్యుల యేకచ్ఛత్రపాలనమునసుండిన రాజ్యము ఛిన్నాభిన్నమై వేర్వేరు రాజుల స్వాధీనమయ్యెను. యాదవులు హొయిస్సళులతో తీవ్రమైన యుద్ధములు గావించుచు వారి రాజ్యముయొక్క యుత్తరభాగము నాక్రమించి శివమగ్గ జిల్లాలో తమ సామ్రాజ్య సూచకముగ యశఃపతాకమును నిలిపిరి. ఆ కాలమున బళ్లారి జిల్లాలోని హొసపేట ప్రాంత మెవరి యాధిపత్యమునకు లోబడియుండెనో నిర్ణయించుటకు తగుప్రమాణములు లేవు. హొయిస్సళరాజులైన రెండవ వీరబల్లాళ, సోమేశ్వర, రామనాథుల శిలాశాసనములు హంపియందును, దీనిపరిసర గ్రామములలోను దొరకినప్పటికిని మూడవ బల్లాళుని శాసనములేవియు నిం దిదవ అకు కనబడకున్నవి. ఆ కాలమున రాజకీయపరిస్థితులు చాల తారుమారొందుటయే దీనికి కారణమని తోచుచున్నది. కాని యాదవ రాజ్యమునకు లోబడియుండిన అనంతపురము జిల్లాలోని కొన్ని ప్రదేశములయందు ఇతని శాసనములు కానవచ్చుచున్నవి. మరియు దక్షిణమున హొయిస్సళ రాజ్యమున నిమిడియుండు హావేరి, రాణీబెన్నూరు, శివమగ్గ ప్రాంతములయందు యాదవ సింగణ, మహాదేవ, రామచంద్రుల శాసనములు పెక్కుగానున్నవి. గనుక యాదవ హొయిస్సళులొండొరులతో తీవ్రముగ పోరుచుండిరని స్పష్టమగుచున్నది. కాని, హొసపేట ప్రాంతమునందీరాజుల శాసనములు లేనందున ఈ ప్రదేశము యెవరి ప్రభుత్వమునకు లోబడియుండెనో

తెలియకున్నది. హంపియందును, శివమగ్గ, తుమకూరు, హావేరి తాలూకలలోను నీకాలమున ముమ్మడి సింగయనాయకుని యొక్కయు నతని కొడుకు కంపిలరాయని యొక్కయు శిలాశాసనములు వెలువడియున్నవి. గనుక వీరీప్రాంతమున స్వాతంత్ర్యముతో నేలు చుండిరని తోచుచున్నది. సకల మాండలిక రాజులను తనవశపఱచు కొని స్వాతంత్ర్యభేరిని ప్రయోగించుచు మెఱయుచుండిన యాదవ రామచంద్రుడు సింగయనాయకునికూడ లోబరచుకొనెను. సింగయ నాయకుని మరణానంతరము అతనికొడుకు కంపిలరాయడు రామ చంద్రుని మాండలికుడుగానుండినట్లు శాసనములు తెలుపుచున్నవి. ఇది యిట్లుండ, ఢిల్లీ సుల్తానైన అల్లావుద్దీను ఖిల్జీ తన సేనాధిపతి యైన మలిక్ కాఫురును హిందూరాజులను స్వాధీనపరచుకొనుటకొక గొప్ప సైన్యమునిచ్చి దక్షిణ దేశముపై బంపెను. మలిక్ కాఫురు యాదవ రామచంద్రుని జయించి, కాకతీయ ప్రతాపరుద్రుని యోడించి, వారిని సుల్తానునకు నియమితమైన కప్పమును కట్టుట కొప్పించి మరలెను. మఱియొకసారి అతడే సమయమును పొందు పఱచుకొని హొయ్సళ బల్లాళుని యోడించి యతనిని సుల్తానునకరి గాపుగ జేసెను. తమపరాక్రమ ప్రాబల్యముచేత యెవరిని లక్ష్యపెట్టక తమ యేలుబడిని దక్షిణదేశమున స్థిరముగ నిలుపవలెనను సంకల్పము చేసుకొన్న కంపిలరాయ, కుమార రామనాథులను ఢిల్లీ సుల్తానైన ముహమ్మదు తుఘ్లకు యుద్ధమునందు చంపించి వారి రాజ్యము ను నాశముచేసెను. ఈ విధమున యాదవ, హొయ్సళ, కాక తీయ రాజులయొక్కయు, కంపిలరాయ కుమారరామనాథుల యొక్కయు అవసానకాలము రాగా, దక్షిణ దేశమంతయు మ్లేచ్ఛుల మయమయ్యెడి తరుణము సంభవించినది. మహమ్మదీయుల బలము ప్రబలమగుచుండుటను గాంచిన హిందూమాండలికులకు కాళ్లు నేతులు చల్లబడినట్లాయెను. ఇట్టి సమయమున దైవయోగముచేత సుల్తానునకున్ను అతని దండనాయకులకున్ను తాము జయించిన రాజ్యభాగముల స్వాధీనమునకై తీవ్రమైన కలహము లేర్పడి తుదకు దండనాయకులు అందందు తమతమ స్వతంత్ర రాజ్యములను స్థాపించు

కొన దొడగిరి. ఇట్టి యవకాశము దొరకినదే తడవుగా తల యెత్తుటకై వేచియున్న హిందూ మాండలికులకు అంతరించిన స్వాతంత్ర్యమును పునరుద్ధరించుటకు సమయమేర్పడినది. కంపిలరాయని ఆ స్థానమున భాండాగారాధిపులుగనుండిన హక్క (హరిహర), బుక్కలను శూరులిరువురు ఇట్టి అరాజకమైన సమయమును గైకొని జాగ్రతతో సైన్యమును ప్రోగుజేసుకొని కంపిలిరాయుని రాజధానిగ నుండిన ఆనెగొందియందు నిలబడి స్వతంత్ర రాజ్యమును స్థాపించిరి. దృఢసంకల్పముతో నాల్గుదిక్కులకు విజయయాత్రలు వెడలి వీరు అతిశీఘ్రముననే త్రిసముద్రమధ్యమందు భూమిపై నిర్వ్యాకుల మైన రాజ్యమును స్థాపించిరి. వీరు యాదవ వంశజులైన సంగముని పుత్రులు, గనుక వీరి వంశమునకు సంగమ వంశమని పేరు కలిగెను. విద్యారణ్యుల యాజ్ఞప్రకారము హరిహరుడు హంపి గ్రామమునకు విజయనగరమని పేరుపెట్టి దానినే తన రాజధానిగ నొనర్చెనని యైతిహ్యముకలదు. ఈ నూతన రాజధానియందుండి సంగమ వంశపురాజులు క్రీస్తు 1336 వ సంవత్సరము మొదలు కొని క్రీస్తు 1486 వరకు నవిచ్ఛిన్నముగ రాజ్యమును పరిపాలించిరి. వీరు శైవులు. పంపాపతియైన విరూపాక్షుడే వీరి కులదైవము. వీరియందు కొందరీ దేవుని నామమునే ధరించిరి. ఈ దేవుని నామమే సంతకముగ వీరు తమ దానశాసనములయందు వాడిరి. మఱియు వీరి నాణెములయందు శివపార్వతుల బింబము లొత్తింపబడి యున్నవి. ఈ రాజుల లాంఛనము వరాహము. వీరివంశమున నెందరురాజు లెంతెంతకాలము పరిపాలించిరో స్పష్టముగ తెలియకున్నది. ఏలయన, వీరిలో నొకరి పరిపాలన ముగియుటకుముందే మరియొక రాజు సార్వభౌమ పదవులను వహించి శాసనములను చెక్కించియున్నారు. ఈ రాజులలో ప్రఖ్యాతిగాంచినవా రెవరన ;


సంగముడు
మొదటి హరిహరుడు
(క్రీ.శ. 1336)
కంపణ
బుక్కణ
(క్రీ.శ. 1355-1377)
మారప
ముద్దప
2 వ హరిహరుడు
(క్రీ.శ. 1377-1404)
2 వ బుక్కరాయడు
(1404-1406)
విరూపాక్షుడు
దేవరాయడు
(1406-1422)
విజయరాయడు
(1422)
రామచంద్రుడు
ఇమ్మడి దేవరాయడు
(1422-1446)
శ్రీగిరి
మల్లికార్జునుడు
'ఇమ్మడి ప్రౌఢదేవరాయడు'
(1446-1465)
విరూపాక్షుడు
(1465)
X
ప్రౌఢరాయడు
రాజశేఖరుడు
విరూపాక్షుడు

రెండవ హరిహరుని కాలమున యాదవ అథవా సంగమ వంశపు రాజ్యము విస్తరించి, రెండవ దేవరాయుని కాలమునందు ఘనతకెక్కినది. ఈలోపల వీరిచేత అనేక మహమ్మదీయ రాజులు పరాజితులై యణచబడిరి. విజయనగరపు ప్రఖ్యాతి దక్షిణమున కావేరీ తటమును తరించుటేగాక తూర్పున తెలింగాణ మంతటను వ్యాపించినది. ఉత్తరమున యాదవ రాజ్యముయొక్క దక్షిణ భాగము వీరి వశమైనది. ఇట్టి విశాలమైన రాజ్యమును విజయనగరాధీశులు మాండలికుల మూలమున పాలించుచుండిరి. కాలక్రమేణ రాజవంశమునందు రాజ పదవికొఱకై యంతరికకల హము లేర్పడదొడగినవి. మహమ్మదీయ రాజులు హిందువులపై తమ యధికారమును మరల స్థాపింప యత్నించిరి. విరూపాక్షుని కాలమున సంగమ వంశపు ప్రతాప మంతరించినది. ఈ సమయ మున అతని మంత్రి మిక్కిలి ధూర్తుడును రాజ్యతంత్రపటువునైన సాళువ నరసింహుడు హిందూరాజ్యము పరులపాలై నశించునను భీతిచేత ఎల్లెడల తన బలమును దృఢపరచుకొని తన ప్రభువైన విరూ పాక్షుని కాలముననే రాజ్యమును తన వశపరచుకొని రాజ్యభారమును సాగింపదొడగెను. ఇతని యనంతర మితని కొమారుడు ఇమ్మడి నరసింహుడు గద్దెయెక్కెను. ఈ సాళువ వంశపు రాజులు విరూ పాక్షేశ్వరుని యారాధకులైనప్పటికిన్ని, వైష్ణవ దీక్షను స్వీక రించిరి. ఇమ్మడి నరసింహుని కాలముననే అతని ప్రధానమంత్రి యైన తుళువ నరసానాయకుడో, యతని పుత్రుడు వీరనరసిం హుడో సింహాసనము నాక్రమించి రాజ్యభారమును వహించిరి. వీర నరసింహుడు వ్యాసరాయస్వామిచేత వైష్ణవ దీక్షను పొందినట్లు 'వ్యాసయోగి చరిత'మునుబట్టి తెలియుచున్నది. ఇతని యనం తరము ఇతని తమ్ములైన కృష్ణదేవరాయలు, అచ్యుతరాయలు ఒకరి వెనుక నొకరు సింహాసన మెక్కిరి. కృష్ణదేవరాయల కాల మున విజయనగర రాజ్యము మిక్కిలి ఘనతకెక్కి విజృంభించి నది. ఇతడు మైసూరు ప్రాంతమందలి శ్రీరంగపట్టణము, శివ సముద్రములయందలి కోటలను ముట్టడించి, స్వాధీనము చేసుకొని

తదనంతరము క్రీ.శ. 1513 వ సంవత్సరమున నెల్లూరు జిల్లాలోని యుదయగిరి దుర్గమును కైవసము జేసుకొని, అందుండిన అతి సుందరమైన కృష్ణ విగ్రహమును తెచ్చి విజయనగరమున తాను కట్టించిన ఆలయమందు ప్రతిష్ఠ చేయించెను. క్రీ.శ. 1515 వ సంవత్సరమున నీతడు గుంటూరు జిల్లాలోని కొండవీడు, కృష్ణా జిల్లాలోని కొండపల్లి కోటలను వశపరచుకొని, రాజమహేంద్ర మునుజొచ్చి స్వాధీనము జేసుకొనెను. క్రీ.శ. 1520 లో రాయచూరు కోటను ముట్టడించి బిజాపూరు సుల్తానునికి లోబడి యుండిన కృష్ణా-తుంగభద్ర నదుల మధ్యప్రదేశమును స్వాధీన పరచుకొనెను. కృష్ణదేవరాయల కాలమున విజయనగరరాజ్యము తూర్పున నోఢ్రదేశమందలి కటకమువరకును, పశ్చిమమున బొంబాయికి ఉత్తరముననుండు 'సాల్సెట్టి' ద్వీపములవరకును విస్తరించినది. దక్షిణమున సింహళద్వీప పర్యంతము ఇతడు దిగ్విజయము సల్పెనని ఇతని యరవశాసనములలో బేర్కొనబడిన 'ఈళన్దిరైగొండ' యను బిరుద మొకటి సూచించుచున్నది. ఈతని యనంతరము ఇతని తమ్ముడు అచ్యుతరాయలు సింహాసన మెక్కెను. ఇతడు సత్వహీనుడు. ఇతని కాలమున రాజ్యతంత్రపు సూత్రముల బలము తగ్గినది. కృష్ణదేవరాయల అల్లుడైన రామరాజు, అతని సహోదరులైన తిరుమలరాజు, వెంకటాద్రులు ప్రబలులైరి. వీరిలో రామరాజు అచ్యుతుని అణగద్రొక్కి తానే రాజ్యభారమును గైకొనెను. అచ్యుతుని యనంతరము పట్టమెక్కిన సదాశివుని కాలమునందు రామరాజు చతురతతో నయముగా మహమ్మదీయ రాజులలో పరస్పర విరోధములు కల్పించి తన రాజ్యమును స్థిరపరచుకొనెను. అహమదునగరము, గోల్కొండ రాజుల పక్షమున నిలిచి, బిజాపూరి ఆదిల్‌శాహులపై దండెత్తి వెడలి ముదగల్, రాయచూరు మొదలైన ప్రదేశములను స్వాధీనపరచుకొనెను. బిజాపూరు సుల్తాను రామరాజునకు సామంతుడై కొంతకాలము విజయనగరమందు వసించెనని నిదర్శనములున్నవి. కాలక్రమమున హిందూ మహమ్మదీయ రాజులలో కలహములు సంభవిల్లి నానాటికి

ప్రబలినవి. హిందువులలో సంఘీభావము తగ్గినది. మహమ్మదీయులందరు నేకమై క్రీస్తు 1565 వ సంవత్సరమున రక్కసతంగడిగి రణాంగమునందు విజయనగర రాజుయొక్క సైన్యముల నోడించి, చెదరగొట్టి, హంపిని తమ వశపరచుకొని వర్ణనాతీతమైన ఘోరకృత్యముల నొనరించిరి. విజయనగరము పాడైనది. కాని విజయనగర సామ్రాజ్య మంతటితో నంతరించలేదు. కాలక్రమాంతరములవలన రాజధాని విజయనగరమునుండి పెనుగొండకును, యచటినుండి చంద్రగిరికిని మార్చబడినను క్రీ.శ. 1614 వ సంవత్సరమునందు వీరవెంకటపతిరాయల మరణమువరకును రాయల యధికారము తుంగభద్ర పర్యంతముగల ప్రదేశముపై వ్యాపించియుండెను. రక్కసతంగడిగి యుద్ధము జరిగిన తరువాత సదాశివరాయలను ముందుంచుకొని అళియ రామరాజు తమ్ముడగు తిరుమల రాజు రాజ్యము నల్పదొడగి క్రీ.శ. 1570 వ సంవత్సరమున తానే రాజ్యాభిషేకము గావించుకొనెను. ఇతని మరణానంతరము ఇతని కుమారుడు శ్రీరంగదేవరాయలు క్రీ.శ. 1584 వ సంవత్సరమువరకును, తదనంతరము ఇతని తమ్ముడు వీరవెంకటపతి రాయలును రాజ్యముచేసిరి. వెంకటపతిరాయలు క్రీ.శ. 1614 వ సంవత్సరమున గతించెను. ఇతని తరువాత నానాటికి రాజుల బలము క్షీణించి, దేశమున హిందువులలో సంఘీభావము నశించి తురకల యడావుడి మెండై క్రమక్రమమున దేశమంతయు వారికి స్వాధీనము కాజొచ్చెను. వీరవెంకటపతిరాయ లనంతరము 2 వ శ్రీరంగరాయలు, రామదేవరాయలు, 3 వ వెంకటపతిరాయలు, 3 వ శ్రీరంగరాయలు వరుసగా రాజ్యముచేసిరి. కాని, వీరు శక్తిహీనులగుటచేత వికలమగుచున్న రాజ్యమును చేరబెట్టి సంరక్షించజాలక పోయిరి. క్రీ.శ. 1650 వ సంవత్సరప్రాంతమున రాయరాజ్యము సంపూర్ణముగ నశించినది.

## 5. హంపి-విజయనగర కట్టడములు.

---

### దేవాలయములు.

హంపి అనేక దేవాలయములవల్లను ముఖ్యముగా పంపాపతి యొక్క సన్నిధిచేతను గొప్ప క్షేత్రమని పేరొందినదని యిదివఱకే చెప్పియున్నాము. దీనికి సమీపముననే ఒకటి, రెండు మైళ్ల అంతరమునందు రాజనగరులు, వాటికి సంబంధించిన కట్టడములు, మరియు దేవాలయములు స్థాపింపబడినవి. ఇచటి శిథిలములలో ప్రథమముగ దేవాలయములను, తరువాత రాజభవనములు, తత్సంబంధమైన కోటలు, కాలువలు మొదలగు కట్టడములను వివరింపనగును. ఇచటి అవశేషములు సుమారు పది పన్నెండు మైళ్ళ విస్తీర్ణముగల ప్రదేశమున వ్యాపించియున్నవి. ఇచటి పౌరాణిక ధార్మికచిహ్నములు రామాయణ కథలను ఇప్పటికిని ప్రేక్షకుని స్మరణకు దెచ్చుచున్నవి.

హొసపేటనుండి కదిరాంపురం బోవు మార్గమునను, హంపికి బోవు మార్గమునను, హంపియందును యీ క్రింది దేవాలయములను చూడనగును :—

**1. అనంతశయన గుడి.**—ఈ గుడియు నిదే పేరుగల చిన్నగ్రామమును హొసపేటకు ఒక మైలు దూరముననున్నవి. ఆలయము వున్నతమైన గోపురముతోగూడిన గొప్పకట్టడము. శయనమూర్తియైన మూలవిగ్రహముయొక్క పూర్ణదర్శనమగు నిమిత్తము గర్భగృహమునకు మూడు ద్వారములు లుంచబడియున్నవి. కృష్ణదేవరాయలు శక 1446 వ (క్రీ.శ. 1524) సంవత్సరమున సాలె తిరుమలరాయపురమనెడి యీ గ్రామమును (అనంతశయనగుడిని) నిర్మించి అందు అనంతపద్మనాభునికి ఆలయముకట్టించి దేవుని పూజ పునస్కారములకు అనేక గ్రామములను దానమిచ్చినట్లు ఆలయమందలి యొక శాసనములో వ్రాయబడియున్నది. ఈ గుడియందు




3 లక్ష్మీనరసింహుని విగ్రహము.

యిప్పుడు మూలవిగ్రహము కాన్పించదు. మహమ్మదీయుల బాధకు వెఱచి ఆ విగ్రహమును హడగలి తాలూకాలోని హొళలు గ్రామమునకు సాగించి, దానికి యందొక ఆలయమును కట్టించినట్లు వదంతి యున్నది. శక 1471 వ (క్రీ.శ. 1549) సంవత్సరమున సదాశివరాయలు అనంతశయనుని దర్శించి, దేవునికి భూదాన మొసగినట్లు ఆలయమందలి శాసనములలో నొకదానియందు వ్రాయబడియున్నది.

2. లక్ష్మీనరసింహుని విగ్రహము.—అనంతశయనగుడి నుండి పంపకుబోవు మార్గమున ఏడు మైళ్ల దూరమున నీ విగ్రహమున్నది. ఇరువదిరెండడుగులు ఎత్తుగల ఒకే రాతిని తీర్చి చేయబడియుండు యీ బ్రహ్మాండమైన విగ్రహమును చూడగనే దాని భవ్యమైనట్టియు ప్రసన్నమైనట్టియు స్వరూపము వ్యక్తమగును. శక 1421 వ (క్రీ.శ. 1499) సంవత్సరమున ఆర్యకృష్ణభట్టుడను బ్రాహ్మణు డొకడు యీ విగ్రహమును కృష్ణదేవరాయల యాజ్ఞ మేరకు ప్రతిష్ఠించెననియు, రాయలు దీని పూజాదులకు రెండు గ్రామములను దానమొసగెననియు నచట నొక శాసనమున లిఖింపబడియున్నది. నరసింహుని అంకముపై కూర్చున్న లక్ష్మీదేవి విగ్రహమున్ను, నరసింహుని కాలు నేతులును విజయనగర విప్లవమున తురకలచేత పగులగొట్టబడియున్నవి.

3. ఉద్భవలింగము.—పై జెప్పిన నరసింహుని విగ్రహమునకు యెడమవైపున గొప్ప లింగ మొకటి చిన్న గుడిలో స్థాపించబడియున్నది. దీని యడుగుభాగము సదా నీటిలో మునిగియుండును.

4. కృష్ణస్వామి ఆలయము.—పై బేర్కొన్న రెండు ఆలయములకును యనతిదూరముననే ఉత్తరమున నీ విశాలమైన ఆలయమున్నది. ఇందలి చెక్కడపుపని చాల యుత్కృష్టమైనది కాకపోయినను మంటపములందలి స్తంభములపైనను గోడలపైనను నుండు కృష్ణలీలల యనేక దృశ్యములు యాత్రికుని దృష్టిని ఆక

క్షింపకమానవు. క్రీ.శ. 1513 వ సంవత్సరమున కృష్ణదేవరాయలు నెల్లూరు జిల్లాలోని ఉదయగిరిపై దండెత్తిపోయి కోటను ముట్టడించి వశపరచుకొని, అందుండిన చక్కని కృష్ణవిగ్రహమును తెచ్చి యీ ఆలయమునందు ప్రతిష్ఠగావించి దేవుని పూజాపునస్కారములకు అనేక దానములొసగినట్లు ఆలయమందలి శాసన మొకదానిలో వ్రాయబడియున్నది. ఆలయమున కెదుటనుండు విశాలమైన వీథి యిప్పుడు వరిపొలముగా మారియున్నది.

5, 6. 'సాసివెకాళు గణేశుడు', 'కడలేకాళు గణేశుడు'.— ఈ రెండు విగ్రహములును నొకదానిప్రక్క నొకటి కృష్ణస్వామి యాలయమున కుత్తరమున సుమారు నాలుగు ఫర్లాంగుల దూరమున నున్నవి. మొదటి విగ్రహము గొప్పది, కాని చిన్న మంటపమునందు నిల్పబడియున్నది. రెండవ విగ్రహము మొదటి దానికంటె చాల చిన్నదైనను దీని ఆలయము విశాలమైనది; ముఖమంటపము చాల ఉన్నతమైన స్తంభములతో కూడిన చక్కని కట్టడము. హాస్యోక్తిగా మొదటి విగ్రహమును 'సాసివెకాళు' (ఆవగింజ) గణేశుడనియు, రెండవ విగ్రహమును 'కడలేకాళు' (శెనగగింజ) గణేశుడనియు నచటి జనులు పిలుతురు.

7. హేమకూటము.— పై జెప్పిన కడలేకాళు గణేశ విగ్రహమునకు పడమట హేమకూటమను గుట్టయొకటి యున్నది. దీనిపైన చిన్నిచిన్ని దేవాలయముల గుంపొకటి యున్నది. వీటిలో నొకటి ప్రసన్న విరూపాక్షునిది, మరొకటి ప్రసన్న ఆంజనేయునిది. మొదటి ఆలయమునకు కృష్ణదేవరాయలు తన పట్టబంధోత్సవ సమయమున భూదానమొసగినట్లు అందలి శక 1435 వ (క్రీ.శ. 1513) సంవత్సరపు శాసనమున బేర్కొనబడియున్నది. మరొక ఆలయములో నొక స్తంభముపైన కంపిలరాయడు తన పితృపితామహ ప్రపితామహుల జ్ఞాపకార్థముగ లింగస్థాపనము జేసి గుడి కట్టించెనని శాసనము లిఖింపబడియున్నది. ఆ యాలయము ఇదే



4. ‘సాసివెకాళు’ గణేశుని విగ్రహము.

కావచ్చును. ఈ యాలయముల కట్టడపు రీతి జైనపద్ధతి ననుసరించి యుండుటచేత ఇవి జైనబసదులని కొందరు పండితుల యభిప్రాయము. కాని యాలయముల గోడలపైనను శిఖరములపైనను తీర్చియుండు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది విగ్రహములు ఇవి శైవ అథవా వైష్ణవాలయములని సూచించుచున్నవి. ఈ యాలయముల చాటుననే బండలలో సాలలు సాలలుగా తొలచబడిన పెక్కు లింగములున్నవి.

8. విరూపాక్షాలయము.—ఈ యాలయము హేమకూటపర్వతము చాటున నున్నది. దీని ముంగిటనుండు నూరడుగుల వెడల్పును రెండువేల నాన్నూరడుగుల నిడుపునుగల విశాలమైన వీథియు దాని యిరుప్రక్కలనుండు కట్టడములు యిచటి పూర్వ ప్రభావమును చాటించుచున్నవి. కృష్ణదేవరాయలకాలమున విజయనగరమునకు వచ్చియుండిన పయస్ అను పోర్చుగీసు ప్రయాణీకుడు దేవుని దర్శనమునకై వచ్చు యాత్రికులకును, అతిథులకును బసచేయుటకు వీథి కిరుప్రక్కలను వసతియైన భవనములును, తనకొఅకై యొక రాజభవనమును రాజు కట్టించినట్లు వ్రాసియున్నాడు. ఈ కట్టడము లిప్పటికిని యున్నవి. దేవుని రథోత్సవములు యీ వీథియందే జరుగుచుండెడివి. ఇపుడుకూడ ప్రతి సంవత్సరము అశ్వయుజ పౌర్ణమినాడు మహావైభవముతో రథోత్సవము జరుగుచున్నది. ఈ వీథి చివరనుండు నందిమంటపమే యీ యాలయపు పాదఘట్టము. ఈ మంటపముయొక్క కట్టడపురీతి చాళుక్య కాలపు కట్టడముల పద్ధతిని యనుసరించియున్నది. ఈ యాలయమందలి భువనేశ్వరిగుడికూడ నట్టిదేయనియు నిదివరకే జెప్పియున్నాము. విరూపాక్షేశ్వరుని ఆలయముకూడ నాటిదేయైనను, పూర్వపుకట్టడము శిథిలముకాగా ఆచోటనే నవీనముగ కట్టబడిన ఆలయమే మన కిప్పుడు కానవచ్చునది. ఈ యాలయమునందు చాళుక్యయుగపు స్తంభములు యిప్పటికిని యున్నవి. ముందు చెప్పియున్న కలిదేవరసు కాలమున (క్రీ.శ. 1013) నీ దేవుడు

మహాకాలు డని ప్రసిద్ధిగాంచెననియు, చాళుక్య వినయాదిత్యుని కాలమున నిది గొప్ప తీర్థముగ వెలయుచుండెననియు నిదివరకే జెప్పియున్నాము. ఈ దేవుని యర్ధాంగియైన పార్వతీదేవి పంపా దేవియనియు భువనేశ్వరియనియు ప్రసిద్ధిగాంచెను. భువనేశ్వరిగుడి యిప్పటి ఆలయమందలి మూలవిగ్రహముయొక్క (విరూపాక్షేశ్వరునియొక్క) గర్భగృహమునకు యెడమువైపున శాస్త్రోక్తముగ సమరేఖయందుండక యేదో యొకమూలలో నుండుటవలన పూర్వము శిథిలావస్థలోనుండిన మొదటి ఆలయమే కాలాంతరమున పునరుద్ధరింపబడి ఇపుడు మనకు గనబడు విరూపాక్షాలయమని తెలియుచున్నది. పాడుపడియుండిన ఆలయమును హరిహరరాయలు విద్యారణ్యుల ఆజ్ఞానుసారము మరల కట్టించెనని యైతిహ్యముకూడ నున్నది. దేవునికి నైఋత్యమున నుండు దీపస్తంభమును క్రీ.శ. 1428 వ సంవత్సరమున మీనమామాత్యుని పౌత్రుడైన ఐతనుడు నిలిపెనని యచటి శాసనమొకటి యందు వ్రాయబడియున్నది. కృష్ణదేవరాయలు తన రాజ్యాభిషేక సమయమున (క్రీ.శ. 1509-10) ఈ యాలయపు రంగమంటపమును కట్టించి దేవుని నిత్యనైమిత్తికోత్సవములకు కొన్ని గ్రామములను దానమొసగినట్లు ఆలయములోని శాసనములలో నొకదానియందు లిఖింపబడియున్నది. ఉత్తరమున నుండు గోపురమునుకూడ యీ రాజే కట్టించినట్లు ప్రతీతియున్నది కాని, దానిని నైజాము రాష్ట్రమున నుండిన కణ్ణగిరి నాయకుడు కట్టించెననియు, తత్కారణమున దానికి కణ్ణగిరి గోపురమని పేరువచ్చినదనియు కొందరభిప్రాయపడుచున్నారు. పయస్ యాత్రికుని వర్ణన యిప్పటి ఆలయమును చూచినవారికి జ్ఞప్తికి తెచ్చుచున్నది. 'మహాద్వారపు గాలిగోపురముపైని ప్రతిమలు చిత్రముగాను చూచుటకు మిక్కిలి అందముగాను వున్నవి. లోపలి ద్వారముకూడ దీనివలెనే నిర్మింపబడియున్నది. దీని యంతరముననే చుట్టు యెత్తయిన గోడలచే నావృతమైన విశాల ప్రాకారమున్నది. ఈ ప్రాకారముగుండ తుంగభద్రయొక్క కాలువ పారుచున్నది. రంగమంటపమునందుండి ఆలయముయొక్క దృశ్యము అతి రమ్యముగ నుండును.'

విద్యారణ్యుల గుడి.—కణ్ణగిరి గోపురమునుండి నదికి పోవు దారిలో నెడమవైపున విద్యారణ్యుల గుడి యున్నది. అందుండు విద్యారణ్యస్వామి విగ్రహము నూతన ప్రతిష్ఠయని తోచుచున్నది.

9. కోదండరాముని గుడి.—హంపి బజారు చివరన నుండు నంది మంటపము చాటున బండలతో పరచిన బాట యొకటి యున్నది. నదియొడ్డుననే ఈ మార్గమున వెడలి కోదండరామస్వామి ఆలయము చేరవచ్చును. ఇచటి ప్రకృతి దృశ్యము మిక్కిలి రమణీయము. సీతా, రామ, లక్ష్మణ, సుగ్రీవ, హనుమంతుల చక్కని విగ్రహము లిందున్నవి. ఈ యాలయము నకు సమీపముననే వ్యాసయతులచేత ప్రతిష్ఠింపబడిన యంత్రోద్ధార ఆంజనేయుని ఆలయమున్నది. హనుమంతుని విగ్రహ మొక యంత్రమునకు మధ్య నమరియుండునట్లు చాల అందముగ చెక్కబడియున్నది.

10. అచ్యుతరాయని గుడి.—కోదండరాముని యాలయమున కీశాన్యముననుండు వరాహ అనంతశయనుల ఆలయములను దాటినవెంటనే దక్షిణదిశయందు అచ్యుతరాయని గుడి కనబడును. ఈ యాలయమున కెదుట అందమైన మంటపములచే నలంకరింపబడిన విశాలమైన వీధియున్నది. ఈ వీధిని 'సూళె బజా' రని పిలుతురు. ఆ కాలమున నిది వేశ్యవాటికగా నుండెనని తోచుచున్నది. ఈ వీధియందే దేవుని రథోత్సవములుకూడ జరుగుచుండెడివి. ఇప్పు డీ ప్రదేశమంతయు వరి పొలముగా మారియున్నది. క్రీ.శ. 1539 వ సంవత్సరమున నీ యాలయమును అచ్యుతదేవరాయలు కట్టించెనని ఇచటి శిలాశాసనములందు లిఖింపబడియున్నది. కట్టడపు రీతి విఠ్ఠలాలయమును పోలియున్నప్పటికిని ఆ యాలయపు చక్కదనము, శిల్పముల సొగసు దీనియందు కాన్పించవు. ఇచటి మంటపములు, మిద్దెలు చిత్రముగ కట్టబడియున్నవి. రాతిస్తంభములపైని కృష్ణలీలా విగ్రహములు చాల అందముగ తీర్చబడి

యున్నవి. ఆలయపు ద్వారమున మకరవాహనముతో కూడిన గంగాదేవియొక్క చక్కని విగ్రహమొకటి యున్నది. ఇట్టి శిల్పములు ఉత్తర హిందూస్థానమున 8 వ శతాబ్దపు దేవాలయముల యందు కానవచ్చుచున్నవి. బహుశ ఆ శిల్పముల శైలిననుసరించి ఈ విగ్రహము చేయబడియుండవచ్చును.

ఈ యాలయమునకు దక్షిణమున మతంగ పర్వతమునకు పోవు సోపానము లున్నవి. పర్వతముపైన పరశురాముని యాలయమున్నది. కొండపైనుండి హంపి-విజయనగర-తుంగభద్రల దృశ్యము చాల మనోహరమైనది. సోపానములు దిగి, వరాహ, అనంతశయనాలయములను దాటి ఉత్తర ముఖముగ కొంతదూరము వెడలినయెడల నది యొడ్డుననుండు ఆలయ మొకటి కానవచ్చును. దీని శిఖరము జైనాలయములందువలె విమానాకారముగ నుండుటచేత నిది జైనాలయమని తోచినను, దీని మహాద్వారమునందుండు జయవిజయుల విగ్రహములు, గోడలపైననుండు కృష్ణలీలా శిల్పములనుబట్టి ఇది యొక వైష్ణవాలయమనుట నిశ్చయము. ఈ యాలయమునకు సమీపముననే రెండంతస్తుల మంటప మొకటి యున్నది. ఇచట వ్యాసమునులు తమ శిష్యులకు వేదాంత శాస్త్ర ప్రవచనము గావించుచుండిరట. ఈ యాలయమున కెదుటనే బండపైన '* సీత చెరగు' ను, దీని చాటుననే సుగ్రీవుని గుహయు నున్నవి. వీటి సమీపముననే తుంగభద్రను దాటుటకు విజయనగరాధీశులచేత కట్టింపబడిన మంటపాకారముగనుండు రాతి సేతువొకటి యున్నది. ఇది సంపూర్ణముగ లేదు. శిథిలమై పడిపోయినదో, లేక కట్టడమే ముగింపక నర్ధములో నాపివేయబడినదో తెలియదు.

---

* సీత చెరగు.—సీతను రావణుడు కొనిపోవుచుండగా నామె తన యాభరణములను కొంగున కట్టి యిచట పడవేసెననియు, ఆ యాభరణముల మూటను కపియొకటి సుగ్రీవుని గుహలోని కీడ్చుకొనిపోయెననియు దాని గురుతులు అచట నిప్పటికిని యున్నవనియు ప్రతీతియున్నది.



5. తులాభారము.

తులాభారము.—పై బేర్కొన్న సుగ్రీవుని గుహకు నీశాన్యమున సుమారు రెండు ఫర్లాంగుల అంతరమున రాయేవారు తులాపురుషదానము సేయునపుడు తులతూగుటకై నిర్మింపబడిన రాతిచట్టమున్నది. స్తంభముల మధ్య పది, పండ్రెండడుగుల యంతర ముండునట్లు దాదాపు పదునైదడుగుల యెత్తుగల రాతి స్తంభములపై నడ్డముగా నొక దూలమును అమర్చిన ఈచట్టము చూచుటకు నొక ద్వారమునుపోలియున్నది. స్తంభములు పుష్పహారములతోను, బొమ్మలతోను నయముగ తీర్చబడియున్నవి. దూలమునకు క్రింది భాగమున త్రాసును వ్రేలవేయుటకు మూడు ఉంగరములున్నవి. రాజులు తమ పట్టబంధోత్సవములందు ఇచట తమ తూనికకు సరియగునంతటి సువర్ణ, వజ్ర, వైడూర్యాద్యమూల్య వస్తువులతో సరితూగి దానమొసగెడివారట. త్రాసుయొక్క కంభములలో నొకదానిపైన మకుటధారియు ముకుళిత హస్తుడునైన రాజుయొక్కయు, యతని ఇద్దరు రాణులయొక్కయు శిల్పములున్నవి. ఇవి కృష్ణదేవరాయుల, మరియు నతని యిద్దరు భార్యలవై యుండవచ్చును.

11. విజయవిట్ఠలుని ఆలయము.—పై జెప్పిన తులాపురుష స్తంభమునకు అనతి దూరముననే విజయవిట్ఠలుని ఆలయమున్నది. ఈ గుడియొక్క మూలమందిరము కృష్ణరాయులచేత కట్టింపబడి, యాతని యనంతరము కాలక్రమమున యితర ఆలయములతోను మంటప ప్రాకారములతోను వేర్వేరు రాజులచేత విస్తరింపబడినట్లు ఆలయమునందలి శాసనములనుబట్టి తెలియుచున్నది. క్రీ.శ. 1516 వ సంవత్సరమున కృష్ణదేవరాయలు ఆలయపు ఆవరణములోపల నూరు స్తంభముల మంటపమును కట్టించెనని యొకశాసనమున లిఖించియున్నది. క్రీ.శ. 1532 వ సంవత్సరమున మూల విగ్రహమునకు వెనక ప్రక్కన యోగనరసింహమూర్తిని వ్యాసతీర్థులు ప్రతిష్ఠచేసినట్లు మరొక శాసనమున లిఖించియున్నది. క్రీ.శ. 1538 వ సంవ

త్సరమున రాచనగరి యధికారియైన రఘునాథనాయకుడు ఆల యపు ఉత్తరముననుండు గోపురముపైని శిఖరములను నెత్తించెనని యొకశాసనమునుబట్టి తెలియుచున్నది. క్రీ.శ. 1554 వ సంవత్సరములో ఉదయగిరి తిమ్మరాజు దేవుని డోలోత్సవమునకై గర్భగృహమునకెదుట నొక శిలామంటపమును కట్టించెను. కృష్ణదేవ, అచ్యుత, సదాశివరాయలు దేవునికి పూజలును ఉత్సవములును జరుపుటకు అనేక గ్రామములను, భూహిరణ్యాది దానములను నొసగిరి. దేవుడు పరాంకుశ మంటపమునకు విచ్చేయునపుడు జరుపవలసిన యుపచారముల కొఱకు సదాశివరాయలు క్రీ.శ. 1558 వ సంవత్సరములో భూదానమొనర్చెను. ఇందలి శాసనములను బట్టిచూడ నీయాలయపు ప్రాకారములో లక్ష్మీనారాయణుని గుడి యొకటి యుండెనని తెలియుచున్నది. విజయనగరమందలి యాలయములలో నీ విట్ఠలస్వామి యాలయము చాల చక్కని కట్టడము. ఇందలి శిల్పనైపుణ్యము అద్వితీయమని ఫెర్గూసన్ మొదలగు పండితులు నుడివియున్నారు. ఇందు కానవచ్చు శిల్పకళాచాతుర్యము దక్షిణ దేశమున నాకాలపు ఆలయములలో నెందునులేదు. ఈ యాలయములోని మూలమందిరమునందుండు శిల్పముల సౌందర్యమునకు సాటిలేదు. ఆలయపు మంటపములోని స్థంభములు ఒకే రాతిని తీర్చిన సప్తస్వరములను మ్రోగు చిన్ని చిన్ని స్తంభములతో కూడినవై చూచుట కచ్చెరువొందించును. ఆలయమునకెదుట నొక సొగసైన రాతి తేరున్నది. దీని చక్రములుకూడ రాతివే. ఈ చక్రముల నొకసారి త్రిప్పినంతటనే విట్ఠలుని రథము నీడ్చినంత పుణ్యమును పొందుదురని యాత్రికుల నమ్మకము. దీని సొగసును గాంచి వెఱగొందు జనులు, ఇది దివ్యరథముగాని మానుషకృత్యము గాదని తలంచెదరు. తక్కిన ఆలయములవలెనే, దీని యెదుట కూడ విశాలమైన వీథియున్నది.

## 6. విజయనగరపు రాజభవనములు.

విజయవిట్ఠలుని యాలయమునుండి రాజభవనములు, తత్సంబంధమైన ఆలయములు, మరియు నితరకట్టడములను చూచుటకు ముందు పేర్కొన్న కృష్ణస్వామి యాలయము మీదుగ నైఋతి దిక్కున పోవలెను. ఈ ప్రదేశమందలి పరిశిష్టములను క్రింద వివరింతము.

12. తురుత్తు కాలువ.—ఇది రెండవ బుక్కరాయల కాలమున చాలధనమువెచ్చముచేసి తుంగభద్రకు అనకట్టి అందుండి రాచనగళ్లకును పట్టణమునకును కావలయు నీటికొఱకు తేబడిన కాలువ. దీనియందు నీరుసదా చాలత్వరితముతో పాఱుచుండుటచేత నిది తురుత్తు కాలువయని పేరొందినది. ఈ కాలువ నిర్మించుటకు పూర్వము విజయనగరమందు పానయోగ్యమగు నీరులేక జనులు చాల కష్టపడుచుండిరనియు, త్రాగుడునీరు ఆనెగొందినుండి తేబడుచుండెననియు, ఇచటి బావులలోని యుప్పునీరు పంట పైరుల సాగుబడికి సైతము అయోగ్యముగానుండెననియు, నీకాలువ నిర్మించుటచే నీబాధలన్నియు తొలగుటయేగాక పంటలు సమృద్ధిగపండి రాజుయొక్క కందాయము విశేషముగ హెచ్చినదనియు నాకాలమున నీ పట్టణమునకు విచ్చేసియుండిన నూనిజ్ అను పోర్చుగీసు యాత్రికుడు వ్రాసియున్నాడు. దీనిని కట్టించిన వైజ్ఞానికుని శోధనశక్తిని, శాస్త్రపరిచయమును మేజర్ హెండర్సన్ తన వ్యాసమునందు చాల పొగడియున్నాడు. ఇప్పటికిని నీ కాలువనీటితో నూరారు యెకరముల భూములు సాగుబడి జెందుచున్నవి.

13. ఉద్దాన వీరభద్రుని గుడి.—తురుత్తు కాలువనుదాటి దక్షిణముఖమై వెడలినయెడల నీ చిన్నగుడి కనబడును. భవ్యమైనటువంటి ఎత్తైన వీరభద్రుని విగ్రహము చిన్ని గృహమునం దమర్చబడియున్నది. క్రీస్తు శక 1545 వ సంవత్సరమున సదాశివరాయల కార్యకర్తయైన రామరాజయ్య

తమ్ముడైన ఎఱదిమ్మరాజయ్యయొక్క దళవాయి జంగమయ్య కృష్ణాపురముపేట యందలి 'హిరియకాలువ' (ఇప్పటి తుఱుత్తు కాలువ) కు చాటున ముద్దువీరణ్ణను ప్రతిష్ఠచేయించి, దేవుని పూజ పునస్కారములకు కొన్ని దానము లొసగెనని యందుండు శిలాశాసనమందు వ్రాయబడియున్నది. గాన నీదేవుని పేరు ముద్దువీరణ్ణ యని తెలియుచున్నది. కాలక్రమమున 'ముద్దు' యను పదమునకు బదులు దేవుని భవ్యమైన యాకృతిని సూచించు 'ఉద్ద' యనుపదము (కన్నడమున 'ఉద్ద' యనిన 'ఎత్తు' యని యర్థము) వాడుకకు వచ్చినట్లున్నది. విజయనగరపు ఈప్రాంతమునకు కృష్ణాపురమని పేరుండెననియు పై శాసనమునుబట్టి తెలియుచున్నది. ఈ గుడి సమీపమున అనేక మాస్తిశిలలు (మహాసతి శిలలు), వీరశిలలు ఉండినవి. ఇవన్నియు నిపుడు రాజనగరి చాటుననుండు బయలునందు సర్కారువారిచేత పోగు చేయింపబడి యున్నవి. దీనిని 'బహిరంగ ప్రదర్శన శాల' (Open-air Museum) అందురు.

వీరభద్రుని ఆలయమునుండి దక్షిణముఖముగ కొంతదూరము వెడలిన బ్రహ్మాండమైన చప్టాంతిబండలు రెండు కనబడును. ఇవి యొకటి పై నొకటి వాలి యొకటి నొకటి కౌగలించుకొని యుండునట్లు కనబడుటచేత వీటిని అక్కచెల్లెండ్ర బండలందురు.

**14. పాతాళ శివాలయము.**—ఈ యాలయము పై బేర్కొన్న అక్కచెల్లెండ్ర బండలకు సమీపముననే యున్నది. భూమి మట్టమునకు క్రింద కట్టియుండు ఈ యాలయములోనికి బోవుటకు సోపానములున్నవి. ఇచటి శాసనములలో నొకదానియందు ప్రసన్నవిరూపాక్షుని కొసగిన దానములను బేర్కొనియుండుటచేత నిదియే ఈ శాసనమున బేర్కొన్న ప్రసన్న విరూపాక్షుని యాలయము గావచ్చును. కాని, ఇపుడు ప్రసిద్ధిగనుండు ప్రసన్న విరూపాక్షాలయము హేమకూటముపైన నుండునదియే.

ఈ యాలయమునకు సమీపమున హంపియందుండి పచ్చుమార్గము రెండుగ చీలి ఒకదారి రాచనగరులకును మరొకటి రాణీనివాసమున కును పోవుచున్నవి. పై జెప్పిన శివాలయమునకు తూర్పున యనతి దూరముననే దండనాయకుని కోటయు దానికి దక్షిణమున టంకసాలయు నున్నవి.

**15. దండనాయకునికోట, కచ్చేరీలు.**—ఈ కోట యంతరమందుననే దండనాయకుని వాసస్థాన ముండెను. ఇందొక మూలలో కోటయొక్క కావలిగాండ్రుండుటకు తగు భద్రమైన గోపురాకారపు మిద్దెయు శత్రువుల జాడలను కనిపెట్టుటకొఱకు కట్టియుండు ఉన్నతమైన గోపుర మొకటియు (Watch tower) నున్నవి. మరొక మూలయందు విశాలమైన గదియొకటి యున్నది. ఇది బహుశ నొక సంగీతమందిరమై యుండవచ్చును. ధనుర్విద్యయందును అశ్వారోహణమునందును సమర్థులైన మహమ్మదీయ సిపాయిలను మెచ్చి వారికొఱకొక మసీదును రెండవ దేవరాయలు కట్టించెనని ఫెరిష్టాయను మహమ్మదీయ చరిత్రకారుడు వ్రాసియున్నాడు. కాని అది నగరమున నెచటయుం డెనో తెలియదు. ఇదియే యతడు పేర్కొన్న మసీదు కావచ్చునని కొందరి యభిప్రాయము. కాని కట్టడపు శైలితప్పు, మసీదులకుండ వలసిన లక్షణము లేవియునిందు కాన్పించకున్నవి. మరియు నీకట్ట డపు క్రింది గోడలపైన హిందూ శిల్పములనేకము లుండుటచేత ఇది మహమ్మదీయులకు సంబంధించిన మందిరము కాదని తోచుచున్నది.

కోట ప్రాకారమునకు మధ్యభాగమున నొక విశాలమైన కట్ట డపు గోడల శిథిలములున్నవి. ఇది దండనాయకుని వాసస్థానమై యుండవచ్చును.

**16. టంకసాల.**—ఇది దండనాయకుని కోట కెడమ ప్రక్కన నున్నట్లు రెండవ దేవరాయని కాలమున విజయనగరము నకు విచ్చేసియుండిన అబ్దుల్ రజక్ అను ఇరాని ప్రయాణికుడు

బేర్కొనియున్నాడు. కాని దీనిచిహ్నము లేవియు నిందిపుడు కాన్పించకున్నవి. కోటకు దక్షిణమున సామాన్యముగ జనులు ప్రవేశించుటకు సులభసాధ్యము కానట్టి భద్రమైన గోడలతో నావృతమైన యొక ప్రదేశమున్నది. ఇదే టంకసాలయుండిన స్థలముగావచ్చును.

పై బేర్కొన్న కట్టడములను, మరియు పట్టణమందలి ఇతర స్థలములను దేవరాయల కాలమున విజయనగరమునకు వచ్చి యుండిన విదేశీయ ప్రయాణికులు వర్ణించియున్నారు. నికోలో డి కాంటి యను ఇటలీ దేశస్థుడు ఈ పట్టణపు చుట్టుకొలత అరువది మైళ్లుండెననియు, కోటకట్టడములు గుట్టలవఱకు వ్యాపించియుండె ననియు వ్రాసియున్నాడు. పై బేర్కొన్న అబ్దుల్ రజక్ ఇట్లు వర్ణించియున్నాడు :—

“ విజయనగరమునుబోలు వైభవముగల పట్టణమును కన్ను లిదివఱకు చూచియుండలేదు ; ఇట్టి పట్టణమొకటి యున్నదని చెవులుకూడ వినియుండలేదు. ఈ పట్టణము యేడు గోడలతో నావరింపబడియున్నది. ఈ గోడల మధ్యనుండు ప్రదేశ ములలో తోటలు, బజారులు, మరియు నగరి కచ్చేరీలు నిమిడి యున్నవి. వెలుపలనుండు మొదటి కోటయొక్క గోడలు పురుష ప్రమాణమంతటి యెత్తైన బండలతో కట్టబడియున్నది. గుఱ్ఱ ములకైనను, సైన్యములకైనను నీగోడదాటుట కశక్యము. కేంద్ర మున నుండు యేడవ కోటలో రాజనగరులు, తత్సంబంధమైన ఇతర కట్టడములు నిర్మింపబడియున్నవి. ఈ యేడవ గోడకును ముందు జెప్పిన మొదటి గోడకును మధ్యనుండు ప్రదేశము పూర్వ-పశ్చిమ, ఉత్తర-దక్షిణములుగా యేడెనిమిది మైళ్ల విశాలమైనది. మొదటి గోడనుండి మూడవ గోడవఱకు తోటలు, పొలములు మరియు సాధా రణ జన నివాసములును యున్నవి. అందుండి రాచనగరికోట గోడ పరిసరమునకు పోనుపోను జననివాసములు, అంగడి సాలలు, సంతలు విశేషముగనుండును. రాచనగరికి సమీపమున అంగడి సాలలు

నాలుగు ఒకటియెదుటనొకటి యున్నవి. నగరిద్వారము తూర్పు దిశనున్నది. బజారుల మిద్దెలున్నతమై విశాలముగానుండినను, రాచనగరిలోని సభామంటపమంతటి యున్నతమైన కట్టడము వేరెందునులేదు. అంగడి సాలలు చాలసిదుమైనవి, వెడల్పైనవి. నగరమునందెందు చూచినను నీరు పారుచుండు కాలువలును, మొహరీలును యున్నవి. నగరి ఎడమ వైపున విశాలమైన దివానుఖానా యున్నది. దీనికెదుట ఇరువది గజముల నిడుపును తొమ్మిది గజముల వెడల్పును గల విశాలమైన పడసాల యొకటి యున్నది. ఇందే దఫ్తరుఖాన (కచ్చేరి) కూడనున్నది. కారకోనులు ఇచటనే పనిచేయుదురు. ఈ పడసాలయందే దండనాయకు డధిష్ఠించునట్టి యున్నతమైన ఆసన మొకటి యున్నది. పడసాలకు బయట చోపదారులు (సిఫాయిలు) కావలియుందురు. దివాను, మఱియు దండనాయకుడు న్యాయాన్యాయములను తీర్పు చేయుదురు. అందుపైన పునర్విచారణలేదు. పనిముగిసిన పిమ్మట దండనాయకుడు యేడు వాకిండ్లను దాటి రాజనగరికి వెడలి రాజునకు దినచర్యను తెలుపును. నగరి వెనుక భాగమున దండనాయకుని నివాసమున్నది. దీనికెడమ ప్రక్కన టంకసాలయున్నది. దివానుఖాన కెదుట గజశాలయున్నది. టంకసాల కెదుట కార్యాధ్యక్షుడు పండ్రెండు వేల కాల్బలముతో కావలియుండును. టంకసాలకు వెనుకభాగమున ఇన్నూరు గజముల నిడుపును పదునైదు గజముల వెడల్పునుగల విశాలమైన వీధియున్నది. దీని కిరుప్రక్కలను భవ్యమైన మేడలును మంటపములును వాటికెదుట నునుపైన బండలతోచేసిన చక్కని ఆసనములును యున్నవి." పై వర్ణననుబట్టి హొసపేటకు నైఋతియందు మొదటికోట ప్రారంభమై యుండవలెననియు, హొసపేట సమీపమున రెండవ గోడయుండవలెననియు, నాలుగవగోడ ఇప్పటి మల్లనగుడి చాటున నుండవలెననియు, దానికి యుత్తరమున నైదవకోటయు (ఇచటకోట ద్వారమిప్పటికిని యున్నది), కమలాపురము చెరువునకు దక్షిణమున నారవకోటయు, కమలాపురమునకు ఉత్తరమున నేడవకోటయు నుండి

నట్లు తెలియుచున్నది. చివరను బేర్కొన్న యేడవకోట గోడ ఇప్పటి కిని చాలమట్టుకు కట్టినరీతినే నిలిచియున్నది. దీనియంతరముననే రాచనగరులు, తత్సంబంధమైన కట్టడములు కట్టబడినవి. ఈ కో టచేత నావృతమైన ప్రదేశము పూర్వ-పశ్చిమముగ రెండు మైళ్లకు పైగను, ఉత్తర-దక్షిణముగ మైలుకు పైగను నున్నది.''

**17. హజార రామస్వామి ఆలయము.**—పై బేర్కొన్న దండనాయకుని కోటకు కుడివైపుననుండు ఈ యాలయము రాచనగరికొఱకు నిర్మింపబడినది. ఇది ఇనూ్నరడుగుల నిడుపును నూటపది యడుగుల వెడల్పునుగల చక్కని కట్టడము. విజయనగరశైలిని కట్టబడియుండు ఆలయము లకు ఇది తగు నిదర్శనముగ నున్నది. విజయనగరమందలి శిల్పకళా చాతుర్యమును ఈ యాలయమందలి చిత్రమైన శిల్పములలో కాన వచ్చును. కృష్ణదేవరాయలు క్రీ.శ. 1513 వ సంవత్సరమున నోఢ్రదేశపు గజపతిరాజును జయించి, యుదయగిరిని కైవసము జేసుకొని మరిలినపుడు ఈ ఆలయమున నొకమంటపము కట్టించి దేవుని పూజాదులు జరుపుటకు ఆరు గ్రామములను దానమొసగెనని ఈ యాలయమందలి శాసనములనుబట్టి తెలియుచున్నది. ఆలయపు గోడలపైనను స్తంభములపైనను రామాయణ, భారతములందలి యనేక కథలను చూపించు శిల్పములు చాల బాగుగ జెక్కబడి యున్నవి. శిల్పశాస్త్రదృష్టితోను, శిలామూర్తి కళాదృష్టితోను పరికించుట కీశిల్పములు చాల యుపయుక్తములుగనున్నవి. ఇవిగాక ఆలయము చుట్టు వెలుపల యస్తిభారపు గోడలపైన నగరియందలి దండుయొక్క వైభవమును చూపు గజతురగపదాతుల సాలలును, ఉత్సవాది సమయములలో పాల్గొను నృత్యక, గాయకుల గుంపు లును చాల చిత్రముగ జెక్కబడియున్నవి. ఈ యాలయపు కొన్ని భాగములు కృష్ణదేవరాయల కనంతరము కట్టింపబడినట్లు తోచు చున్నది.




8. హజారరామస్వామి ఆలయపు వెలుపలి గోడలపైని శిల్పముల దృశ్యము.




౨. అంతఃపుర మహాద్వారము.



1. కమల మందిరము.

**18. రాణివాసము.**—హజారరామస్వామి ఆలయమునకు వాయవ్యమున రాణివాసమును, తత్సంబంధమైన కట్టడములును యున్నవి. ఈ కట్టడములన్నియు నున్నతమైన గోడతో నావరింపబడియున్నవి. ఈగోడకు పశ్చిమ దిశయందు మహాద్వారమున్నది. తూర్పు-దక్షిణములందుండు ద్వారములు యాత్రికుల సౌకర్యమునకై నిటీవల సర్కారువారిచే నిర్మింపబడినవి. ఈ ప్రాకారపు మధ్యభాగమందు దాక కట్టడపు ఆస్తిభారపు గురుతులు మాత్ర మిపుడు కనబడుచున్నవి. ఇవియే రాణీభవనముయొక్క చిహ్నములని తోచుచున్నది. ప్రాకారమున నుత్తర-దక్షిణ మూలలందు గోపురాకారముగ కట్టియుండు ఉన్నతమైన కావలి గోపురములు (Watch towers) రెండున్నవి. ఈ కట్టడములు మహమ్మదీయ కట్టడపు రీతి ననుకరించియున్నవి. రాణివాసమందలి కావలి స్త్రీలు వెలుపల జరిగెడు చర్యలను వీటిపైనుండి కనిపెట్టుచుండిరని తోచుచున్నది.

**కమలమందిరము (Lotus Mahal).**—రాణివాసమునకు సమీపముననే నీ కట్టడమున్నది. ఇది ఆకృతియందు కమలమును బోలియుండుటచేత లోటస్ (కమలము) మహల్ అను పేరును బొందెను. క్రింది భాగమువలెనే పై మేడకూడ కమలాకారముగనున్నది. ఏ వైపుననుండి చూచినను యొకేరీతిగ కనబడు ఈ చక్కని కట్టడము ఇచటి శిథిలములలో నన్నిటికంటె భద్రముగ నున్నది. పై బేర్కొన్న కట్టడములు అబ్దుల్ రజాక్ వ్రాసినట్లు రాజనగరున కనతి దూరముననే యుండుటచేతను, నివి రాణివాసమున కర్హములుగ నుండునట్లు కాన్పించుటవలను, నివి రాణీ నివాసపు కట్టడములని చెప్పవచ్చును.

**19. కావలిల్లు.**—రాణివాసమునకు ఈశాన్యమున స్వల్ప దూరముననే ఎత్తైన కట్టపై కట్టియుండు విశాలమైన చావడిని బోలు కట్టడము కనబడును. ఈ కట్టడము రీతిని చూడ నిది రాచనగరి పారాగాండ్రకొరకు నిర్మింపబడినట్లు తోచుచున్నది.

**20.** గజశాల.—ఇదికూడ రాణివాసమునకు సమీపముననున్నది. ఒక్కొక్క యేనుగ కొక్కొక్క గది చొప్పున నిది సుమారు ఇరువది గదులుగల నిడుపైన కట్టడము. గదులలో నొకటి నుండి మరియొకటికి పోవుటకు చిన్న వాకిండ్లున్నవి. గదుల ప్రమాణమును బట్టి ఇవి యేనుగుల కొరకే కట్టించినవని చెప్పవచ్చును. అబ్దుల్ రజాక్ పట్టణమును వర్ణించుచు, దండనాయకుని భవనమున కెదుట నొక గజశాలయున్నదని వ్రాసియున్నాడు. కాని పై చెప్పిన గజశాల ఇది కానేరదు. ఏలయన నిది రాణివాసమునకు సమీపముననున్నది. ఒకవేళ రజాకు చెప్పిన గజశాల ఇదియే యైనయెడల మన మిదివరకు రాణివాసములని వర్ణించిన కట్టడములను దండనాయకుని భవనములని యెంచవలయును. దివాను ఖాన యందుండి రాచనగరికిపోవుటకు యేడు వాకిండ్లను దాటి పోవలయునని రజాక్ వర్ణనయందు వ్రాసియుండుటచేత, రాచనగరి చాటుననే దివానుఖానయుండి యుండవలయుననుట స్పష్టము. దాని సమీపమునకూడ మరియొక గజశాల యుండియుండవచ్చును.

రాణీనివాసమునకు పశ్చిమ దిశయందుండు గోడచాటున కుమారరాముని గరడీమందిరమని పిలువబడు కట్టడమొకటి యున్నది. రాణీ నివాసమునకు సమీపమున గరడీయిల్లు ఉండుట యసందర్భము గనుక నిది గరడీమందిరము కానేరదని తోచుచున్నది.

**21.** ఆస్థానమంటపము.—విజయనగరమందలి కట్టడములలో నన్నిటికంటె నిదియున్నతమైనదని దీనిని చూచిన అబ్దుల్ రజాక్ అను పర్షియాదేశపు రాయభారి వ్రాసియున్నాడు. దీనియందే రాజసభలు జరుగుచుండెడివట. ఇపుడీ కట్టడపు ఆస్తిభారము మాత్రము నిలిచియున్నవి. పైభాగమంతయు మ్రాని కట్టడమైయుండి యుండవలెనని తోచుచున్నది. మ్రాని స్తంభములను నిలబెట్టుటకు తాబేళ్లు ఈ కట్టడపుపైన సాలులు సాలులుగ నమర్పబడియుండు చదరపు బండలు ఇపుడుకూడనున్నవి. విజయనగర వినాశమున నీకట్టడము ఇతర కట్టడములతోబాటు కాలిపోయియుండవలెను.



11. గజశాల.

22. రాతితొట్టి.—ఆస్థానమంటపమున కెదుట నీ గొప్ప తొట్టియున్నది. నలుబది రెండడుగుల నిడుపును, మూడడుగుల వెడల్పును రెండడుగులు తొమ్మిది యంగుళముల లోతునుగల యీతొట్టి యొకే రాతిని తొల్చి చేయబడియున్నది. రాజును సందర్శించుటకు వచ్చిన మాండలికులు, రాయబారులు ఇత్యాదుల గుఱ్ఱములు నీరు త్రాగుటకు ఇది ఉపయోగింపబడుచుండెడిదట.

23. రహస్యమందిరము.—ఇది భూమిక్రింద సొరంగము త్రవ్వి లోపల నొక గదివలె కట్టబడియున్నది. దీనిపైనను కట్టడ మొకటి యుండినట్లు కనబడుచున్నది. లోపల దిగుటకు సోపానములును వొక వైపునుండి మరియొక వైపునకు వచ్చుటకు లోపలనే ప్రదక్షిణాకారమైన మార్గమును యున్నవి. రాజకీయ గుప్తాలోచనలు ఇందు జరుగుచుండెడివని ప్రతీతి. కాని, ఇది యొక దేవాలయమై యుండవచ్చునని తోచుచున్నది.

24. రాజనగరు.—ఈ కట్టడముయొక్క అస్తిభారము మాత్రమిప్పుడు నిలిచియున్నది. పై పేర్కొన్న రహస్యమందిరమునకు దక్షిణమునసుండు ఉన్నతమైన అస్తిభారము దీనిదే. ఈ బండలపైన నగరిలో పండుగలప్పుడు జరుగు ఊరేగింపులు, గజతురగపదాతి సమూహముల దృశ్యములు చక్కగ చెక్కబడియున్నవి. అస్తిభారపు గోడలు ఇటుకలతో కట్టినవని యచటి యవశేషములు కాన్పించుచున్నవి.

25. సింహాసన మంటపము.—ఇది విజయనగరమందలి పరిశిష్టములలో నన్నిటికంటె అందమైనది. దీనిని 'దశరా దిబ్బ' లేక 'మహానవమిదిబ్బ' యనికూడ పిలుతురు. పయస్ అను పోర్చుగీసు ప్రయాణీకుడు పట్టణమును వర్ణించుచు నీ సింహాసనమంటపమును విజయమందిరమని పేర్కొనియున్నాడు. కృష్ణదేవరాయలు ఓఢ్రదేశపు గజపతిరాజును ఓడించి, తూర్పు దిగ్విజయమును గావించి వచ్చి దీనిని కట్టించెననియు నతడు నుడువియున్నాడు. నవ

రాత్రిపంతుగలలో మహానవమినాడు రాజు రత్నఖచితసింహాసనముపై
నిచటకూర్చుండి మాండలిక రాజులు, విదేశీయ రాయభారులు, శ్రీమం
తులైన నగరనివాసులు, వీరపరివారము సుఖసంకల్పవాదములను
పొందుచుండుట మహానవమినాటి యుత్సవ దృశ్యములు ఈమం
టపముయొక్క గోడలపై నగిసుంచిరేఖలు చెక్కబడియున్నవి. ఈ
శిల్పములను బట్టి చూడ రాయలవారి సైన్యమున విదేశీయ సైనికులు
కూడ యుండెనట్లు తెలియుచున్నది. ఇందు ఇరాను దేశపు రాయ
భారులు రాజుకు ప్రణామము సల్పుచుండు దృశ్యమొకటియున్నది.
ఇచటి శిల్పముల చెక్కడపుపనియు హజారరామాలయమందలి శిల్ప
ముల చెక్కడపుపనియూ నొకేరీతిని యున్నవి. ఈ శిల్పముల పరి
శీలన ఆకాలపుసామాజిక పరిస్థితులను తెలిసికొనుటకు ఉపయుక్తమైయు
న్నవి. సింహాసనమంటపముయొక్క నైఋతి ప్రక్కన మన్య
నొక గుహాను బోలు సొరంగమున్నది. దీని కిరుప్రక్కల నొక
వైపునుండి దిగి, మరియొక వైపునుండి పైకెక్కుటకు సోపా
నములున్నవి. ఈ గుహాయొక్క గోడలపైన కంచుపాండవులని చెప్ప
బడు కొన్ని శిల్పములున్నవి. ఇవి వీరపురుషుల యాకృతులని
తోచుచున్నది.

**26. రాతి తలుపు.**—సింహాసనమంటపమునకు దక్షిణ
మున దారి ప్రక్కన నొక బ్రహ్మాండమైన రాతి తలుపున్నది. ఇది
యొకేరాతినుండి ద్రూని తలుపులవలె తీర్చబడియున్నది. ఇది యే
కట్టడమునకు సంబంధించినదో తెలియదు.

**27. రాజపుత్రుల స్నానమందిరము.**—సింహాసనమం
టపమునకు దక్షిణమున అర ఫర్లాంగు దూరమున రాచనగరికి సం
బంధించిన రాజపుత్రుల స్నానమందిరమున్నది. ఇపుడిచట కాన
వచ్చునది గచ్చుతో కట్టియుండు విశాలమైన తటాకమును బోలు
నొక తొట్టి. దీనికి నీరుపారుటకును, నందుండి నీరు పారిపోవు
టకును రాతి కాలువలున్నవి. మంటపమునకు నైఋత్యమున




15. సింహాసనమంటపము : వసంతోత్సవ విలాసములను సూచించు శిల్పముల దృశ్యము.



16. సింహాసనమంటపము : దక్షిణపు గోడపైనుండు శిల్పముల దృశ్యము.



17. సింహాసనమంటపమున సమీపమునను౦డు రాతి కాలువలు.

నొక ఫర్లాంగు దూరమున సప్తకోణాకారమైన కట్టడమొకటియున్నది. దీని మధ్య నొక కారంజమును (Fountain) నొక పెద్ద రాతి తొట్టియును నున్నవి. ఈ కారంజమునకు నీరువచ్చు సన్నని పెంకు గొట్టములు ఇప్పటికిని కానవచ్చుచున్నవి. ఈ కారంజమందిరమునకు నీరు సమీపమునందున్న బావినుండి ఏతములతో నెత్తబడి కాలువలగుండ తేబడుచుండెనని తోచుచున్నది. పై చెప్పిన రాతితొట్టి యొకే రాతినుండి చేయబడినది. దీనిని పండుగ రోజులలో రాజు పాలతోనింపించి పేదలకందరికి పంచువాడట !

28—30. రాణి స్నానమందిరము, నీటి తొట్టి, కాలువలు.—సింహాసనమంటపమున కాగ్నేయమున సుమారు ఫర్లాంగు దూరమున రాణీ స్నానమందిరమున్నది. ఉన్నతమైన గోడలతో నావరింపబడిన యొక చదరమైన ప్రాకారమును, దాని మధ్య నీరు నిండుకొనుటకును, సుఖమజ్జనమునకు కావలయునంత నీరు నిలుచునట్టియును విశాలమైన కృత్రిమ సరోవర మొకటియు నున్నవి. ఈ సరోవరమునకు నీరు బావులనుండి ఏతములతో నెత్తి కాలువలగుండా పారింపబడుచుండెనని తోచుచున్నది. సరోవరమునందలి నీరు వెలుపలికి పోవుటకు దక్షిణమున నొక కాలువయున్నది. ఈ కట్టడము మహమ్మదీయ శైలిని కట్టబడియున్నది. దీనికి సమీపముననే నీటిని సంచయించుటకొరకు కట్టిన ఉన్నతమైన రాతికట్టడమొకటియున్నది. అచటికనతిదూరముననే యొక పెద్ద బావియున్నది. ఈ బావినుండి ఏతములతో నీరెత్తి, పైజెప్పిన తొట్టిని కాలువలగుండ నీటితో నింపి, అందుండి నీరు తొట్లమూలముగను కాలువలమూలముగను రాచనగరి యనేక భాగములకు పంచబడుచుండెనని తోచుచున్నది. "రాజనగరు నడుమ యెచట చూచినను రాతి కాలువలలో స్వచ్ఛమైన నీరు పారుచుండు"నని అబ్దుల్ రజాక్ వ్రాసియున్నాడు. కావున నా కాలమున వ్యక్తిగతమును ప్రత్యక్షముగ జూచిన నీతని వర్ణన పై యూహను బలపరచుచున్నది.

31—33. జలక్రీడా మందిరము, గానుగిత్తి గుడి, చక్రాతిలో తొల్చినగుహ.—పైన చెప్పిన తొట్టిచాటుననుండు దిబ్బను దాటిన మొదల చంద్రశేఖరుని ఆలయము కనబడును. దీనికి సమీపముననే ఈశాన్యమున అష్టకోణాకారముగల చక్కని క్రీడా మందిరమొకటియు, దీనికే ఆగ్నేయమున సుమారు రెండు ఫర్లాంగుల దూరమున గానుగిత్తిగుడి యను జైనాలయ మొకటియు నున్నవి. ఈ యాలయమునకీ పేరు ఏ కారణమువలన కల్గెనో తెలియదు. దీని మహాద్వారము యొక్క చట్టముపైన జైన విగ్రహము లుండుటచేత నిది జైనాలయ మనుట విశదము. ఇందొక శాసనమున రెండవ హరిహరుని మంత్రియైన ఇరుగప్ప క్రీ.శ. 1385 వ సంవత్సరమున నీ యాలయమును కట్టించి యందు కుంథుజిననాథుని ప్రతిష్ఠించి నట్లు వ్రాయబడియున్నది. ఇరుగప్ప జైనుడు.

గానుగిత్తి గుడికి ఉత్తరమున సుమారు ఒక ఫర్లాంగు దూరమున నొక బ్రహ్మాండమైన చక్రాతి బండ యున్నది. భూమి మట్టమునకు నాలుగైదు అడుగుల క్రిందనుండి దీనిని తొల్చి వడసాల వలె నొక గదియు, దాని యంతరమున నొక గర్భగుడిని బోలు గదియు నిర్మింపబడియున్నవి. లోపలిగదియొక్క వాకిటి చట్టము పైన కమలమును దాని కిరుప్రక్కల సూర్యచంద్రబింబములును చెక్కబడియున్నవి. ఇది బహుశః జైన చైత్యాలయము కావచ్చును. దీని కాలమును నిర్ణయించుటకు తగు సాధకములు లేకున్నవి.

34. భీమునిగవను.—గానుగిత్తి గుడినుండి తూర్పునకు రెండు ఫర్లాంగుల దూరమున నీ ద్వారమున్నది. ఈ గవను గోడపైన చక్కగ చెక్కబడియుండు భీముని రూపము లుండుటచేత దీనికీ పేరు కలిగినది. విజయనగరమును ఆవరించియుండు కోటయొక్క ద్వారములలో నీ రీతిని కట్టియుండు గవను యిది యొకటే. తక్కిన ద్వారములలో నిపుడు నిలిచియుండునవి విఠ్ఠలాలయము నకు బోవు మార్గముననుండునది యొకటి, పట్టాభిరామస్వామి



18. తలారిగట్టు మార్గమందలి కోట గవను.

ఆలయమునకు ఈశాన్యమున అరమైలు దూరమున నుండునది మరి యొకటి. వీటిపైనుండు గోపురములు మహమ్మదీయ శైలిని అనుక రించియున్నవి.

**35. పట్టాభిరాముని గుడి.**—ఈ ఆలయము కమలా పురమునకు తూర్పున నరమైలు దూరముననున్నది. విజయనగరము నందలి ఆలయము లన్నిటికంటె నిది విశాలమైనది. ఇచటి శిల్ప ముల చెక్కుడు పని ముందు బేర్కొన్న హజారరామ, విట్ఠలాలయ ములందలి శిల్పములవలె ప్రశస్తముగ లేదు. ఈ యాలయమును అచ్యుతదేవరాయలు కట్టించెనని ఇచటి శాసనములనుబట్టి తెలియు చున్నది.

**కమలాపురము చెఱువు.**—కమలాపురమునకు పశ్చిమ మున నొక మైలు దూరమున నీ గొప్ప చెరువు యున్నది. దీని యున్నతమైన అనకట్టపై కట్టియుండు మంటపములను చూడ నీ చెరువు విజయనగరాధీశులచేతనే నిర్మింపబడి యుండవలెనని తెలియుచున్నది.

**36. రాయని చెఱువు.**—కృష్ణదేవరాయలు తన తల్లి నాగలాదేవి పేరట నాగలాపురమను (హొసపేటకు సమీపముననుండు నాగేనహళ్లి) పట్టణమును నిర్మించి అందే యతడు విశేషముగ బస సేయుచుండెను. అచట పంట పైరులకును, ప్రజలకును అవశ్యమైన నీటి వసతి కొఱకు హొసపేటకు నైఋత్యమునసుండు సండూరు పర్వతావళియందు రెండు గుట్టలమధ్య నొక గొప్ప యనవేయించి అగాధమైన తటాకమును కట్టించెను. చెరువు కట్టు సమయమున నందు జరుగుచుండిన పనులను సమక్షముగజూచిన పయస్ అను పోర్చుగీసు ప్రయాణీకుడు ఇట్లు వర్ణించియున్నాడు, "కృష్ణదేవ రాయలు తటాకములను కట్టించుటయందు నిపుణుడైన జోవిరో డి ఫోంటియను గోవాదేశపు శాస్త్రజ్ఞుని యధ్యక్షత క్రింద ఈ తటాకమును కట్టించెను. దీని నీటివల్లనే రాయలు నాగలాపుర

మును సరోవర ఉద్యాన క్రీడోపవనములతో నలంకరింపజేసెను." ఈ చెరువు విజయనగరమునకు చాలదూరమున నుండుటచేత ఇం దుండి విజయనగరమునకు నీరు పారుచుండలేదని తోచుచున్నది.

పై జెప్పిన హంపి-విజయనగరముల వర్ణనయందలి ముఖ్యాంశము లెవ్వియన, బుక్కరాయల కాలమున నగరము విస్తీర్ణమున చాల స్వల్పముగ నుండెను. విరూపాక్షాలయముకూడ చిన్నదే. హేమకూటముపైన కొన్ని దేవాయతనములుమాత్ర ముండినవి. రెండవ హరిహరుని కాలమున గానుగిత్తిగుడి కట్టింపబడినది. అతని పుత్రుడు రెండవ బుక్కరాయడు తురుత్తు కాలువను త్రవ్వించి విజయనగరపు ఉత్తరభాగమునకెల్ల నీరు పారునట్లు జేసెను. రెండవ దేవరాయని కాలమున అబ్దుల్ రజాక్ వర్ణనను బట్టి విజయనగరము యేడు కోటలతో నావరింపబడి యుండెననియు, వెలుపలి మూడు కోట ప్రాకారముల మధ్యప్రదేశమునందు జనావాసము విశేషముగ లేకుండెననియు తెలియుచున్నది. తుళువరాజులకాలమున పట్టణము చాల విస్తరించినది. విరూపాక్షాలయపు అనేక భాగములు క్రొత్తగ కట్టబడినవి. నగరిలోని కృష్ణస్వామి ఆలయము, లక్ష్మీనరసింహ, గణేశుల గొప్ప విగ్రహములు, అచ్యుతరాయని గుడి, విజయవిట్ఠలుని గుడి, హజారరాముని గుడి, పట్టాభిరాముని గుడి మొదలైన ఆలయములును, రాచనగరులు, రాణీనివాసము, సింహాసనమంటపము మొదలగు కట్టడములును ఈ కాలముననే నిర్మింపబడినవి. పట్టణము విశాలమైన వీథులతోను అంగడి సాలలతోను శోభించినది. తురుత్తు కాలువనుండి హంపికిని, ఏతముల భావులనుండి రాజనివాసమునకును, రాయని చెరువునుండి నాగలాపురమునకును నీరు పారుదల యగుచుండెను. ఈ రాజుల కాలముననే హంపినుండి హొసపేటవరకు నుండు ప్రదేశము యావత్తు క్రిక్కిరిసిన జనావాసముగల గొప్ప పట్టణమై యుండెను.

## 7. విజయనగరము, విదేశీయ ప్రయాణీకులు.

విజయనగరమునకు వేంచేసిన పరదేశ ప్రయాణీకులలో మొట్ట మొదటివాడు నికోలో డి కోంటి యను ఇటలీ దేశస్తుడు. ఇతడు క్రీ.శ. 1420-21 వ సంవత్సరమున రెండవ దేవరాయల పాలనమున నీ పట్టణమును సందర్శించి పట్టణముయొక్క విస్తారమును, అందలి జనుల సంప్రదాయములను గురించి యిట్లు వ్రాసియున్నాడు : "బిసెనెగలియ (విజయనగర) పట్టణము ఉన్నతమైన పర్వతముల చాటున నున్నది. దీని చుట్టుకొలత అరువది మైళ్లు. విశాలమైన ప్రదేశము నావరించియుండు దీని కోట గోడలు పర్వతముల పైవరకు కట్టబడియున్నవి. ఈ నగరిలో శస్త్రములను ధరించుటకు యోగ్యులైన మనుష్యులు తొంబది వేలమంది యున్నారు. ఈ దేశమున జనులు తమ కిష్టమైనంత మంది స్త్రీలను వివాహము చేసుకొనెదరు ; ఈ స్త్రీలు వారి భర్తలతోకూడ సహగమనము చేయుదురు. రాజుకు పండ్రెండు వేలమంది భార్యలున్నారు ! రాజు ఎంచెందు వెడలినను నతని భార్యలుకూడ నాలుగు వేలమంది పాదచారులుగను, నాలుగు వేలమంది గుఱ్ఱములపైనను తక్కినవారు పల్లకులలోను యతని ననుసరింతురు.

"జనులు సంవత్సరమున మూడు పండుగలను చాల సంభ్రమముగ జరుపుదురు. ఒక పండుగయందు స్త్రీ పురుషు లందరును స్నానము లొనర్చి క్రొత్త వస్త్రములను ధరించి ఆటపాటలతో మూడు దినములు ముచ్చటగ గడుపుదురు. (ఇది యుగాది పండుగ గావచ్చును.) మరొక పండుగయందు ఆలయముల లోను, యిండ్ల వెలుపలను, మిద్దెలపైనను యనేకములైన దీపములను వెలిగింతురు. ఇవి రాత్రింబవళ్లు వెలుగుచుండును. (ఇది దీపావళి పండుగయని తోచుచున్నది.) మూడవ పండుగయందు వీథులలో నందందు ఉన్నతమైన స్తంభములనెత్తి వానికి వివిధములైన విలువగల సరిగెబట్టలను తోరణములవలె కట్టుదురు. పండుగ తొమ్మిది రోజులు జరుగును. (ఇది నవరాత్రి పండుగ.) ఇవిగాక

మరియొక పండుగ మూడు దినములు జరుగును. అపుడు జను లందరు రంగు నీటిని కొళాయిలలో నింపి యొకరిపై నొకరు చిమ్ము కొనుదురు. రాణులతో సహితము రాజుకూడ నీ పండుగయందు పాల్గొనును."

దేవరాయల కాలముననే నికోలో కోంటికి పిమ్మట నిరువది సంవత్సరములకు పర్షియాదేశపు రాయబారియైన అబ్దుల్ రజాక్ అనువాడు ఈ పట్టణమునకు రాజుచే నాహ్వానింపబడి తాను సమ క్షముగ చూచిన మహానవమి పండుగ నిట్లు వర్ణించియున్నాడు:

"ఉత్సవమునకు రాజుచేత నాహ్వానింపబడిన మాండలిక రాజులు, దండనాయకులు, శ్రీమంతులు రాజ్యమందలి పలుభాగ ములనుండి వచ్చి రాజభవనమున చేరిరి. అమూల్యమైన అంబారీ లతోగూడిన పెక్కేనుగులను వారు తమవెంబడి తెచ్చియుండిరి. ఈ పండుగ దినములలో పట్టణమంతయు జనులతో క్రిక్కిరిసి యుండెను. అందందు నాలుగు లేక ఐదు అంతస్తులుగల మంటపములను కట్టి వానిని క్రిందినుండి పైవరకు పలువిధము లైన బొమ్మలతో నలంకరింతురు. ఈ మంటపములలో కొన్ని అతి వేగముగ తిరుగుచు క్షణక్షణము విధ విధములుగ కనబడు చుండును. ఈ యుత్సవభూమికి యెదుట మిక్కిలి చిత్రముగ నలంకరింపబడిన తొమ్మిది మంటపములతో శోభించు రాజభవన ముండెను. తొమ్మిదవ మంటపమందు రాజుయొక్క సింహాసనము నిర్మింపబడియుండెను. ఏడవ మంటపమందు నాకొక స్థలము నొసగిరి. తక్కిన మంటపములు గాయక, గాయినులతోను, బట్టు వాండ్రతోను నిండియుండినవి. రాజునకెదుట చక్కని యుడుపు లను ధరించిన బాలికలు పలుచని తెరవెనుక నృత్యము సేయుచుండిరి. రాజు రత్నఖచితమైన సువర్ణ సింహాసనమున కూర్చుండెను."

ఈ పండుగ రజాబు నెలలో మూడు దినములు జరుగునని వ్రాసియుండుటచేత నిది దీపావళి కావచ్చునని కొందరి యభిప్రాయ ము కాని, వర్ణనను బట్టి ఇది మహా నవమియని నిస్పష్టమగుచున్నది.

అచ్యుతరాయల కాలమున నడచిన మహానవమిపండుగను వీక్షించిన నూనిజ్ అను పోర్చుగీసు దేశస్థుడు ఇట్లు వర్ణించియు న్నాడు :—

"మొదటి రోజు నగరికెదుటనుండు విశాలమైన మైదానములో తొమ్మిదిమంది దండనాయకులు కోటలను బోలు తొమ్మిది మంటపములను కట్టుదురు. ఇవి చాలా ఉన్నతముగను మిక్కిలి మనోహరముగను నలంకరింబడియుండును. ఈ మంటపములలో నర్తకులును, గాయకులును తమ విద్యలను సభకు ప్రదర్శించుచుం దురు. దండనాయకులు తమతమ మంటపములను రాజునకుచూపి యతని శ్లాఘనను పొందుటకు ఆతురముగ నెదురుచూచుచుందురు. సాయంత్రమున నగరి యధికారులందరును తగుదుస్తులను ధరించు కొని రాజును సందర్శించి యతనికి ప్రణామములు సల్పుదురు. తద నంతరము విధవిధములుగ నలంకరింపబడిన తొమ్మిది అశ్వములును తొమ్మిది ఏనుగులును రాజసముఖమునకు తేబడును. గజతురగా ధ్యక్షుడువచ్చి రాజునకు ప్రణామమొనర్చును. రాజపురోహితులు గంధపుష్పమాల్యాదులను నైవేద్యములను తెచ్చి వేదమంత్రములను పఠించుచు ఆ యశ్వములకును గజములకును పూజసేయుదురు. రాజు రత్నసింహాసనాసీనుడై ఈ దృశ్యములనంతయు తిలకించుచుం డును.................... ఈ దృశ్యము ముగిసినవెంటనే అనేకమంది స్త్రీలు నృత్యగానములతోవచ్చి రాజునకు ప్రణమిల్లి పోవుదురు. తదనంతరము పూజింపబడిన గజములను అశ్వములను రాచనగరికి తీసుకొని వెడలెదరు. అపుడు అంతఃపురమునుండి రాయలవారి భార్యలలో నతిసుందరాంగులైన ముప్పదియారుమంది విలువగల వజ్రాభరణములతో నలంకృతులై సువర్ణకలశమున ఆరతి నుంచుకొని రాయలవారి కెదుటవచ్చెదరు. వారి వెంబడి రాజు యొక్క తక్కిన భార్యలును అంతఃపురపు దాసీలును బంగారు పిడులతోగూడిన పంజులతోవచ్చి రాయలవారికెదుట నిలుతురు. ఆరతియైన యనంతరము రాజు తన భార్యలతోకూడ తన

భవనమునకు వెడలును. రాజుయొక్క సమ్ముఖమున నగరిలోని జట్టీ లనేకులు మల్లయుద్ధమునందు తమ ప్రావీణ్యమునుచూపి రాజు చేత పారితోషికములను పొందుదురు. ఇట్లు తొమ్మిది దినములు ఉత్సవములు జరిగిన యనంతరము రాజు అశ్వారూఢుడై తన దండనాయకులయొక్క సైన్యవ్యూహములను పరీక్షించుటకు వెడలును. ఈ తొమ్మిది దినములలోనే సామంతులు, మాండలికులు మఱియు నితర యధికారులు రాజునకు చెల్లింపవలయు కప్పమును ఒప్పగింతురు.''

పై వర్ణనయందలి యనేకదృశ్యములు సింహాసన మంటపముయొక్క గోడలపైనను హజారరామస్వామి ఆలయపు గోడల పైనను చెక్కబడియున్నవి.

పోర్చుగల్ దేశస్థుడైన డామింగోజ్ పయస్ * అనువాడు కృష్ణదేవరాయల కాలమున క్రీ.శ. 1520-22 లో విజయనగరమును సందర్శించి అచ్చటి కోటలను గవనులను రాచనగరిని పట్టణమందలి వైభవములను విస్తారముగ వర్ణించియున్నాడు. "విజయనగరము దచక్ (ధారవాడ)నుండి పదునెనిమిది లీగులకు (లీగు = మూడు మైళ్లు) పైననున్నది. పట్టణమునకు రెండు లీగుల దూరము నుండియే ఉన్నతమైన కోటగోడలు ఆరంభమగును. పట్టణమును చేరుటకు కోటద్వారములగుండ వెళ్లవలయును. మొదటి గవనును దాటిన వెంటనే రాజు నూతనముగ నిర్మించిన పట్టణము కనబడును. (ఇదే నాగలాపురము అథవా హొసపేటకు సమీపమున నుండు ఇప్పటి నాగేనహళ్లి.) దీనియందు రాజుయొక్క ఆజ్ఞానుసారము శ్రీమంతులు, వర్తకులు ఇండ్లు కట్టించుకొని వాసముండిరి. ఈ యూరి సమీపముననే రాజుచేత త్రవ్వింపబడిన అద్భుతమైన యొక తటాక

---

* పయస్ కంటె ముందు నునిజు విజయనగరమును సందర్శించెను. ఈ ప్రయాణికులయొక్క మహానవమి పండుగవర్ణనను ఒకేచోట సెచ్చుటకు నునిజు వర్ణన ముందే వ్రాయనైనది.

మున్నది. ఈ తటాకమున కెదుట రెండు కొండలున్నవి. వీటియందుండి ప్రవహించు నీటితోను దుట్టు ప్రక్కలనుండు గుట్టల మధ్యభాగమందుండి గాలికాలువలగుండవచ్చు నీటితోను ఈ చెఱువు నిండును. పంటపైరుల సాగుబడికి ఈ చెఱువునుండియే నీరు పారుచున్నది. దీనిని కట్టించు సమయమున నిందు వేనవేలు పని వాండ్రచేత జరుపింపబడుచుండిన పనులను నేను స్వయముగ వీక్షించితిని.

"నాగలాపురమునుండి 'బిసనగమునకు' (విజయనగరమునకు) పోవుటకు విశాలమైన రాజమార్గమున్నది. దీని కిరుప్రక్కలను అంగళ్లు, ఇండ్లు వరుసగ కట్టబడియున్నవి. మరియు వారిని నీడ యందుండుటకు రాజు యొక్క ఆజ్ఞమేరకు బాట కిరుప్రక్కల వృక్షములు పెంచబడియున్నవి. ఈ రాజమార్గముననే రాజు భవ్యమైన ఆలయములను కట్టించియున్నాడు. విజయనగర పట్టణమున కెదుటనే భద్రమైన కోటగోడలు కనబడును. దీని చాటుననే పురుష ప్రమాణమంత బండలతో కట్టబడియుండు గోడయొకటి యున్నది. పట్టణము నందుటకు దీనిని దాటి కొంతదూరము వెళ్లవలెను. ఈ గోడయంతరమునసనుండు ప్రదేశమున నందందు వరి పొలములు కుంటలు యున్నవి. ఈ కుంటలకు నీరు రెండు సరోవరములనుండి పారును. పై చెప్పినట్లు కోటగోడకు సమీపముననుండు చెరువునకవతల కొంచము దూరమున నొక మహాద్వారమున్నది. దీని ప్రక్కన రెండు అందమైన గోపురములున్నవి. వీని సమీపముననే రెండు చిన్న దేవాలయములున్నవి. వీనిలో నొక ఆలయమునకు చాటుననుండు కోటగోడ రాజధానిని ఆవరించియున్నది. దీని కవలిదూరముననుండు మరియొక కోట రాచనగరి ప్రదేశమును ఆవరించియున్నది. ఈ కోట ద్వారమునకును రాచనగరికిని అంతరమున అనేకములైన చక్కని రాజమార్గములును రాజుయొక్క దండనాయకులు మరియు నగరి శ్రీమంతుల భవ్యములైన నివాసము లున్నవి. ఇచటి ప్రధానమైన రాజమార్గముగుండ వెడలిన రాచ

నగరి మహాద్వారము విశాలమైన మైదానమున కనబడును. రాచనగరు భద్రమైన రాతి ప్రాకారముచే నావరింపబడియున్నది. దీని యంతరముననే రెండు దేవాలయము లున్నవి.

“.........వీటి సమీపముననే తేరు సాగువీథియున్నది. తేరు చిత్రవిచిత్రములైన బొమ్మలతోను దృశ్యములతోను కూడినదై కంటికి చాల అందముగ కనబడును. ......ఇందుండి కొంత దూరము వెడలిన చక్కని ఇండ్లతో కూడిన అందమైన వీథి యొకటి కనబడును. ఇచట ధనవంతులు వజ్రవైడూర్యాద్యమూల్యవస్తువులు మరియు వివిధములైన విలువగల వస్త్రముల వర్తకులు ఇండ్లను అంగళ్లను కట్టుకొని వసించుచున్నారు. ప్రతి దినము సాయంత్రమున గుఱ్ఱముల వ్యాపారపు సంత జరుగును.........రెండవ కోటగోడకు వెలుపల చేతిపనుల వస్తువుల అంగళ్లుండు వీథియున్నది. ఈ వీథిలో రెండు ఆలయములున్నవి. దీని చివరను ‘మూరు’లను (Moors) జాతివారు నివసించుచున్నారు. ఈ పట్టణమున సకల రాష్ట్రములనుండి వచ్చియుండు వర్తకులను కానవచ్చును. యేలయన నిందు విలువైన రాళ్ల, ముఖ్యముగ వజ్రముల, వ్యాపారము విశేషముగ జరుగుచున్నది. ఈ పట్టణపు వైశాల్యమునుగురించి వ్రాయుట అశక్యము. నేనొక గుట్టపైనుండి ఈ పట్టణమును వీక్షించినపుడు ఇది ‘రోము’ నగరమంత విశాలమైనదని తెలిసినది; అందుండి పట్టణపు దృశ్యము చాల మనోహరముగనుండెను............ఈ నగరము యొక్క జనసంఖ్య నెన్నుట కసాధ్యము.....ప్రపంచమున యన్ని అంశములనుబట్టియు గొప్ప పట్టణమెద్ది యన నది విజయనగరమే. ఇచట వరి, గోధుమలు, కందులు, జొన్నలు మొదలగు ధాన్యము లన్నియు సమృద్ధిగ పండుచున్నవి. మరియు నివన్నియు చాల చవుకగ దొరుకును............ సరకులను మోసుకొనివచ్చిన వెఱుక ఎద్దులతో క్రిక్కిరిసియుండు బజారులలో మనుష్యులకు సైతము నడచుట కసాధ్యము............ఈ పట్టణమునకు ఉత్తరమున అగాధమైన నదియొకటి ప్రవహించుచున్నది. అనేకములైన

చిన్నిచిన్ని కాలువలు ఈ నదినివచ్చి కలియుచున్నవి ....... ..
ఈ నదియొడ్డున 'సేనగొంద్యం' (ఆనెగొంది) అను పట్టణమున్నది.
ఈ పట్టణము రెండు కొండల సాలులనడుమ నున్నది. ఇచట
రాజుయొక్క దండనాయకుడు వాసముండును. విజయనగరము
నుండి జనులు పడవలలోకూర్చొని నదినిదాటి ఈయూరుచేరుదురు.
ఈ పడవలు పెద్ద గంపలను బోలియుండును. ఇవి వంతునకు
పదునైను, ఇరువది మనుష్యులను ఎక్కించుకొనునంతటి విశాలమై
నవి. గుఱ్ఱములు ఎద్దులను సహితము ఈ పడవలలో నెక్కించి
నదిని దాటించుదురు........పట్టణమున కపతల చక్కని ఆలయ
ములు మూడు ఉన్నవి. వాటిలో నొకటి విట్ఠలాలయము, మరొ
కటి 'అపెరడియనర్' (అనగ హంపిరాయని)గుడి. యిదే
విరూపాక్షునిగుడి. ఈ దేవుని జనులు చాల భయభక్తులతో నారా
ధింతురు. ఈ యాలయపు మహాద్వారమున కెదుట విశాలమైన
వీథియున్నది. ఇందు రాజునకొక భవనమును, శ్రీమంతుల ఇం
డ్లును, యాత్రికులు బసచేయుటకొరకు రాజు కట్టించిన మంట
పములును ఉన్నవి. మహాద్వారమునకుపైన చాలయున్నతమైన
చక్కని గోపురమున్నది. ఈ ద్వారమున కెదుట నాలుగు స్తం
భములను నిలిపియున్నారు. వాటిలో రెండు తామ్రపు రేకుతో
కప్పబడియున్నవి. తక్కిన రెంటికి బంగారు ములాము చేసియు
న్నారు. మహాద్వారమునకు సమీపముననుండు స్తంభము ఇపుడు
రాజుగానుండు కృష్ణదేవరాయలు నిల్పించినది. మహాద్వారపు
వెలుపలిగోడ పైవఱకు రాగిరేకుతో మూయబడియున్నది. దీనిపై
బంగారు ములాము చేసియున్నారు. ఈ మహాద్వారమును దాటిన
వెంటనొక యంగణమును దానికెదుట మరియొక అంగణమును

ఉన్నవి. ఈ లోపలి ఆంగణమునకు చుట్టును అరుగులున్నవి. దీని మధ్యనే విరూపాక్షుని ఆలయమున్నది. ఈ ఆలయమునందు గోడలపైన చిన్ని చిన్ని దీపములు పెక్కు గనున్నవి. ప్రతి దినము సాయంత్రము దాదాపు ముప్పదివేల దీపములను వెలిగించెదరట. ఈ ఆలయమునందు పూజపునస్కారములు ప్రతి రోజు మిక్కిలి వైభవముతో జరుగును.''

# అనుబంధము.

**ఆనెగొంది.**—విజయవిఠ్ఠలుని ఆలయమునుండి సుమారు ఒక మైలు దూరమున తుంగభద్రయొక్క యెదురొడ్డున ఆనెగొంది దుర్గమున్నది. నదియొడ్డుననే ఈ దుర్గముయొక్క కోటగోడలు, మహాద్వారములు కనబడును. ఆనెగొంది ఊరు ఇచటికి సమీపముననే యున్నది. ఇదే రామాయణమునందు ప్రసిద్ధిగాంచిన కపిరాజ్యముయొక్క రాజధానిగ నుండిన కిష్కింధ. ఈయూరి చాటుననే యొక గుట్టమైన కుమ్మరమునకు దొరయైన ముమ్మడీ సింగయనాయకుని కోటయున్నది. ఇందుండి సుమారు ఒక మైలు దూరమున గవిరంగనాథుని గుడి, పంపాసరోవరము, దాని చాటుననే శబరిగుహ ఉన్నవి.

**నవబృందావనములు.**—ఆనెగొందికి తూర్పున సుమారు అర్ధ మైలు దూరమున తుంగభద్ర రెండుగ చీలి పారుచున్నది. ఈ చీలికల మధ్యనుండు లంకయందు మాధ్వులకు పవిత్రమైన నవబృందావనములను తొమ్మిదిమంది యతులయొక్క సమాధులున్నవి. ఈ సమాధులేకాక వీటి సమీపముననే ఒక ఫర్లాంగు దూరమున రఘునందన తీర్థుల బృందావనమును, దాని చాటుననే మధ్వాచార్యుల శిష్యులైన నరహరి తీర్థుల బృందావనమునుయున్నవి బృందావనముల ప్రక్కనుండు శాసనములందు ఆయా యతియొక్క నామము, సమాధియైన కాలము ఇట్లున్నవి :

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీ పద్మనాభ తీర్థ | శక | 1[2]46 |
| 2 | శ్రీ కవీంద్ర తీర్థ | ,, | 1321 |
| 3 | శ్రీ వాగీశ తీర్థ | ,, | 1329 |

| | | | |
|---|---|---|---|
| 4 | శ్రీ గోవింద తీర్థ | శక | 1425 |
| 5 | శ్రీ రఘునందన తీర్థ | ,, | 1455 |
| 6 | శ్రీ వ్యాసరాజ తీర్థ | ,, | 1460 |
| 7 | శ్రీ రఘువర్య తీర్థ | ,, | 1479 |
| 8 | శ్రీ సుధీంద్ర తీర్థ | ,, | 1545 |
| 9 | శ్రీ రామ తీర్థ | ,, | 15*5 |
| 10 | శ్రీ శ్రీనివాస తీర్థ | ,, | 15** |

* ఈ గురుతుగల చోట్ల శాసనమున అంకెలు సమిసియుండుట చేత వాటిని నిర్ధరించుటకు కాకున్నది.

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT,
GOVERNMENT PRESS.